

వేదాలలో

# అశ్వినీ దేవతలు





కర్త:
ముముక్షుముని
(డా॥ కొడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

యశ్చకార స నిష్కరత్ స ఏవ సుభిషక్తమః ।
స ఏవ తుభ్యం భేషజాని కృవద్ భిషజా శుచి ః॥

అథర్వవేదము (2-9-5

ఎవడు (ఏ పరమేశ్వరుడు) నీ శరీరమును నిర్మించెనో అతడే నీ సమస్త శారీరక, మానసిక, ఆత్మిక రోగములను బోగొట్టగలడు. అందుకు సరియైన సర్వోత్తమ వైద్యుడు అతడే. అతడే నీకు తగిన ఔషధముల సృజించి చికిత్సకు తోడ్పడు పవిత్ర వైద్యుడు.

ఓం

# అశ్వినీ దేవతలు

(చారిత్రిక, వైదిక వైద్య దేవతలు)

కర్త :

ముముక్షుముని (డా॥ కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల - 37
ప్రతులు - 1000

సృష్టి సంవత్సరము : 197,29,49,103
విక్రమాబ్దము : 2059
దయానందాబ్దము : 179
శ్రీ చిత్రభాను సం॥ మాఘ పూర్ణిమ (ఫిబ్రవరి 2003)

**మూల్యము : రూ. 20=00** (తపాల ఖర్చులు అదనము)

**తపాల ద్వారా ప్రతులకు :**
శ్రీ బాశెట్టి సత్తయ్య, జె - 38, రాంగోపాల్‌పేట్, సికింద్రాబాద్ - 3

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమము, వ్యాస్ వైదిక సేవా సమాజము
12-10-586/6, వ్యాస్‌నగర్, (ఇందిరానగర్ రోడ్డు, నెం. 2)
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061.

2) మాశెట్టి శ్రీనివాస్, Shop No. 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740 , కంచరి బజార్, సికింద్రాబాద్ - 3. ఫోన్ : 5532020

3) ఆర్ష గురుకులము, వడ్లూరు, కామారెడ్డి - 503 111 (నిజామాబాద్ జిల్

4) వైదిక సాహిత్య భండార్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 95.

5) ఆర్. కృష్ణమూర్తి, బుక్ సెల్లర్స్, ఆర్యసమాజము,
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 61.

6) ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా)

# అశ్వినీపతి ప్రార్థన

ఋషిః కృత్నుర్ భార్గవ ః దేవత - సోమ ః

ఓం అభ్యూర్ణోతి యన్నగ్నం । భిషక్తి విశ్వం యత్తురమ్ ।
ప్రేమన్ధః ఖ్యన్నిః శ్రోణో భూత్ ॥

(ఋగ్వేదము 8-79-2)

భావార్థము : హే సోమ ! సౌమ్యుడా ! సర్వప్రియ పరమేశ్వర ! నీ శక్తి అత్యంత అద్భుతమైనది. నీవు వస్త్రములు కూడా లేని నిరుపేదను చీనిచీనాంబరములతో సర్వాభరణభూషితుడైన భాగ్యవంతుని చేయగలవు. సర్వవిధ రోగములతో పీడింపబడు రోగికి కూడా అద్భుతచికిత్స ద్వారా పూర్ణారోగ్యవంతుని చేయగలవు. అంధునికి చక్కని చూపునివ్వగలవు. కుంటివానిని చక్కగా నడిపించగలవు. నీ కృప అపారము.

కాన, నిన్నే నా ప్రథమ వైద్యునిగా - నీ ఉపాసననే ప్రథమ చికిత్సగా చేసుకొందును గాక ! ఆధ్యాత్మిక (శారీరక, మానసిక) వ్యాధులనుండే గాక ఆధి భౌతిక, ఆధి దైవిక వ్యాధులనుండి కూడ తరించి పరమశాంతిని, పరమానందమును పొందుదును గాక !

ప్రార్థించు
ఒక సుమ్మార్థి
**ముముక్షుముని**
(డా॥ కోడూరి సుబ్బారావు)

# ఆధార గ్రంథావళి

1) సృష్టికర్తయైన పరమేశ్వరుని - చతుర్వేదములు
2) ఋషిమునుల - బ్రాహ్మణ అరణ్యకములు
3) యాస్కమహర్షి - నిఘంటు నిరుక్తములు
4) మహర్షి దయానందుని - ఋక్ యజుర్వేద భాష్యములు
మరియు ఆచార్య వైద్యనాథ్ శాస్త్రిగారి-ఋగ్వేద భాష్యము
పం. తులసీరామస్వామిగారి - సామవేదభాష్యము
పం. క్షేమకరణదాసు త్రివేది గారి - అథర్వవేద భాష్యము
పం. దామోదర సాత్వలేకర్ గారి - సరళ సుబోధ వేదభాష్యములు
5) పం. కపిల్‌దేవ్ ద్వివేది గారి - వేదోంమే అయుర్వేద్
6) పం.వీరసేన్ వేదశ్రమీ గారి - వైదిక సంపద
7) శ్రీ ముదిగొండ గోపాలరావుగారి - వేదములలో ఆయుర్వేదము
8) ఆచార్య ఆనంద ప్రకాశ్ గారి - దేవోం కా వైద్య అశ్వినీ కుమారః
9) శ్రీ రాజీవ్ దీక్షిత్ గారి - ఓజస్వీ దేశభక్తి ఉపన్యాస కేసెట్లు
10) ఈనాడు దినపత్రికలు మొదలగునవి.

# విషయానుక్రమణిక


అశ్వినీపతి ప్రార్థన, ఆధార గ్రంథావళి,
ప్రకాశకీయము, ప్రాక్కథనము — ముందు పుటలలో

| | | పుట సంఖ్య |
|---|---|---|
| 1) | పురాణాలలో అశ్వినీదేవతలు | 1 |
| 2) | చరిత్రలో అశ్వినీ దేవతలు | 3 |
| 3) | ఆయుర్వేద ఆవిర్భావము | 7 |
| 4) | భారతీయ శస్త్రచికిత్సకుల ఔన్నత్యము | 9 |
| 5) | ప్రాచీన గురుకులాల ఆదర్శం | 14 |
| 6) | ప్లాస్టిక్ సర్జరీ ఆవిష్కర్తలు భారతీయులే | 17 |
| 7) | ఆయుర్వేద సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రులు | 30 |
| 8) | వేదాలలో అశ్వినీ దేవతలు | 35 |
| 9) | యాస్కమహర్షి దృష్టిలో అశ్వినీ దేవతలు | 37 |
| 10) | దయానంద మహర్షి దృష్టిలో అశ్వినీ దేవతలు | 45 |
| 11) | వేదాలలో శస్త్రచికిత్సా ప్రేరణలు | 53 |
| 12) | వేదాలలో చారిత్రక కథలున్నాయా ? | 59 |
| 13) | ప్రాణాపాన అశ్వినీ దేవతలు | 67 |
| 4) | భిషజానాం భిషక్ పతిః పరమేశ్వరః | 89 |
| 5) | ఉపసంహారము | 98 |

# ప్రాక్కథనము

అశ్వినీ పదము బహుళార్థ ప్రతిపాదకమై యున్నను లోకమున ఆ పదమును దేవవైద్యులైన అశ్వినీకుమార ద్వయముగానే బహుళ ప్రచారం పొందింది. అందుచే వైదిక భావములనుకూడా వైద్యులుగానే అన్వయించి వ్రాయుటకు ప్రయత్నించితిని. అట్లని ఈ ప్రతిపాదన వైదిక భావములకు విరుద్ధము కాదు. అంతేకాక, వైదిక భావములను మరింత ప్రకాశపరచగలదు. సామాన్య ప్రజలకు చక్కటి అవగాహన కలిగించగలదు. ఇది నా నమ్మకము

నేను **వేదాలలో సూర్యకిరణ చికిత్స** అను గ్రంథము వ్రాయుచున్నపుడు పం. శ్రీపాద దామోదర సాత్వలేకర్ గారి **సరళ సుభోద వేదభాష్యములు** పరిశీలించుట జరిగింది. అందువారు అశ్వినీ పదమును చరిత్రతో జోడించి అర్థము వ్రాయుట చూచితిని. అది వేదసమ్మతము కాదు. దానితో నాలో అసలు అశ్వినీ దేవత లెవరు ? ఆయుర్వేదంలోను, చరిత్రలోను కనబడు అశ్వినీ దేవత లెవరు ? అనే ఆలోచనలు ప్రారంభమైనవి. ఆ దృష్టితో స్వాధ్యాయమనన చింతనలు చేసితిని. వాటి పర్యవసానంగానే ఈ చిన్న గ్రంథం వ్రాసితిని.

నేను అత్యంత బలహీనదశలో ఉండగా ఈ గ్రంథం వ్రాయుట జరిగింది. బహుశః ఇది నా చివరి రచన అగునేమో ! అనిపించేటంత బలహీనదశ ఇప్పటికీ ఈ శరీరంలో నెలకొని ఉంది. ఈశ్వరేచ్ఛ ఏమగునో తెలియదు. కాన, విజ్ఞులు ఇందేవేని దోషములున్న సహృదయతతో తెలిపిన పునరాలోచించి ద్వితీయ ముద్రణలో సవరించుకోగలను.

నా వ్రాతప్రతిని జాగ్రత్తగా అర్థంచేసుకుంటూ కంప్యూటర్‌పై కంపోజింగ్ చేసిన శ్రీ వినోద్ కుమార్ చకిలం గారికి నా ప్రత్యేక ధన్యవాదములు. ప్రూఫులు దిద్దిన మా కార్యదర్శి శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు గారికి, సహృదయులు శ్రీ మనస్వీజీ వానప్రస్థి (ఆర్షగురుకులం-వడ్లూరు) గారికి, అందముగా ముద్రించి ఇచ్చిన ప్రింట్‌షాప్ యజమానులు శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య గారికి, వారి కార్యకర్తలకు నా హృదయపూర్వక ధన్యవాదములు

ఒక సుమ్నార్థి,

ముముక్షుముని

(డా॥ కోడూరి సుబ్బారావు)

# అశ్వినీ దేవతలు

కొన్ని పురాణగాథల ప్రభావంతో నేడు లోకంలో అశ్వినీదేవత లంటే దేవ వైద్యులని వీరు జంటవైద్యులని ఎప్పుడు విడిపోక కలిసే తోడుతోడుగా ఉంటారని పెక్కురు (పండితులు, సామాన్యులు) అనుకుంటారు. ఈ అశ్వినీదేవతలు-జంటదేవ వైద్యులు అప్పుడప్పుడు భూలోకములో సంచరించి కొందరికి చికిత్స చేసి అద్భుతంగా ఆరోగ్యవంతులను చేసారని కొన్ని పురాణగాథలు ఉన్నాయి. ముందుగా అందులో కొన్ని గాథలను తెలిసికొందాము.

## పురాణాలలో అశ్వినీ దేవతలు

అశ్వినీ దేవతలిద్దరు వైద్యులగుటచే దేవతలతో సమానంగా కూర్చుని సోమపానం చేసే అధికారం ఉండేది కాదట. కాని, శర్యాతి అను పేరుగల రాజునకు సుకన్య అనే పేరుగల కుమార్తె ఉండేది. విధివశాత్తు ఆమె భర్తయైన చ్యవనుడు వృద్ధుడుగా మరియు అంధుడుగా నైపోయెను. అప్పుడు ఆమె అశ్వినీదేవతలను ప్రార్థించగా వారు కనికరించి చికిత్సచేసి అతనిని తిరిగి యువకునిగా చేయుటయేకాక దర్శనశక్తి (కంటిచూపును) కూడా కలిగించారట.

అప్పుడు చ్యవనుడు సంతసించి ఆ వైద్యులకు దేవతలతో సమానంగా కూర్చుని సోమపానం చేసే అధికారాన్ని కలిగించాడట. వీరిలో ఒకరు ఔషధచికిత్స (మెడిసిన్) లోను, మరొకరు శల్యచికిత్స (సర్జరీ) లోను చక్కటి నైపుణ్యం కలవారు. అందుకు తగిన ఉత్తమ ఔషధాలు, పరికరాలు తమవద్ద ఉంచుకునేవారు. ముసలివారికికూడా కాయకల్ప చికిత్సచేసి తిరిగి యౌవనాన్ని కలిగించేవారు. వీరి జన్మ వృత్తాంతం పురాణాలలో వింతగా కనబడుతుంది. సూర్యునివల్ల ఒక అప్సరా స్త్రీ గర్భమునందు రెండు అశ్వములు - కవలలుగా జన్మించినవట. వారే తదుపరి వైద్యవృత్తిని నేర్చి దేవ వైద్యులుగా ప్రసిద్ధి చెందిరట. ఈ జన్మకథలో ఏదైనా ఆధ్యాత్మికార్థం ఉంటే ఉండవచ్చునేమోకాని జంతువిజ్ఞానం (జూఆలజీ - Zoology) ప్రకారం మావవ స్త్రీకి అశ్వములు పుట్టడం అసంభవం.

ఆ విధంగా జన్మించిన అశ్వినీదేవతలు ఎన్నెన్నో అద్భుత చికిత్సలు చేసినట్లు పురాణాలలో కనబడుతుంది. అందుకొన్నిటిని ఈ క్రింద ఉదహరించుచున్నాము.

ఆ అశ్వినీ దేవతలు వందన అనే పేరుగల జీర్ణశీర్ణమైన ఒక వృద్ధునికి కాయకల్ప చికిత్సచేసి యువకునిగా చేసారు. దృక్ శక్తిని కూడా కలిగించారు. మూడు ముక్కలుగా తెగిపడిన శ్యావని (ఒక యుద్ధ సైనికుని) కాలిని అద్భుతముగా అతికి చక్కగా నడిపించారు. పరావృజుడను పేరుగల అంధునకు కన్నులు అమర్చి దర్శనశక్తిని కలిగించారు. ఋజ్రాశ్వుడనే పేరుగల వ్యక్తి తన తండ్రికి ఒక గొఱ్ఱెల మందను తినుటకు సమర్పించెను. దానితో క్రోధితుడైన అతని తండ్రి ఋజ్రాశ్వుని అంధుని చేసెను. అతడు పశ్చాత్తాపము చెంది అశ్విని

దేవతలను ప్రార్థించగా వారు అతనికి మరణించిన మరొకని నేత్రములు తీసి అతికించి, చూపు తెప్పించారు. అట్లే కవి అను పేరుగల వ్యక్తి ప్రార్థించగా నేత్రాలు అమర్చారు. విశ్వలా అను పేరుగల ఖేలదేశపు రాజపుత్రి యుద్ధములో ఒక కాలును పోగొట్టుకొనెను. అశ్వినీదేవతలు తగిన లోహముతో నిర్మించిన ఒక కృత్రిమ కాలును ఆమెకు అమర్చి చక్కగా నడిపించినారు. కారా గృహంలో బంధింపబడిన రేభకుని ఆరోగ్యవంతుని చేసారు. వంధ్యయైన ఒక గోవుకు చికిత్సచేసి గర్భము కలిగించి పాలిచ్చు ఆవుగా మార్చారు.

## చరిత్రలో అశ్వినీ దేవతలు :

పై అద్భుత చికిత్సలలో చారిత్రిక సత్యాలు ఎన్ని అనే విషయం చెప్పలేము. కాని, ప్రాచీన ఆయుర్వేద శాస్త్రాల దృష్ట్యా పైవన్నీ, సాధ్య చికిత్సలే. కాయకల్ప చికిత్సద్వారా వృద్ధులైన వారి నెందరినో యువకులుగా మార్చిన సంఘటనలున్నాయి. 20వ శతాబ్దములో కూడ శ్రీ తపసీబాబా గారు స్వయముగా వారి శరీరాన్ని కాయకల్ప చికిత్స చేసుకొని 185 సంవత్సరాలు ఆరోగ్యంగా, ఉత్సాహంగా జీవించినారు. శ్రీ మదనమోహన మాలవ్యాగారికి కాయకల్ప చికిత్స చేసింది వీరే. వారి జీవన గాథ ప్రేరణాత్మకంగా ఉంటుంది. ఆయుర్వేద వైశిష్ట్యాన్ని ప్రకాశపరుస్తుంది. కాన, సంక్షిప్తంగా ఈ క్రింద ఉదహరిస్తున్నాము.

## కాయకల్ప చికిత్స

శ్రీ తపసీ బాబాగారి తల్లిదండ్రులు రాజపుత్రులు. తదుపరి బాబాగారు సిక్కుమతమును స్వీకరించిరి. తండ్రి మహారాజా మంగళ సింగ్ (వీరిని సాహెబ్‌సింగ్ అనికూడా అనేవారు). వీరి తల్లి-మహారాణి

నందాకౌర్. వీరి బాల్యనామము కృష్ణసింగ్. వీరు పాటియాల పాలకులు. వీరు ఒకసారి యుద్ధమునకు పోయి తిరిగి వచ్చుసరికి తనభార్య కుమారుడు, తన అన్నగారు శత్రువులతో చంపబడుట చూచి వైరాగ్యము కలిగెను. ఢిల్లీ బాదుషా బహదూర్‌షా వద్దకు వెళ్లి తన పాటియాలకు రక్షణకోరి అక్కడినుండే నేరుగా హరిద్వార్‌కు వెళ్లి తపస్సు చేసిరి. ఉత్తరాఖండమున పెక్కుచోట్ల తపస్సుచేసిరి. తపసీబాబాగా ప్రసిద్ధిచెందిరి.

బాబాగారు పరశురామకుండ సమీపారణ్యాలలో సంచరించుచుండగా ఒక సాధువువద్ద కాయకల్పచికిత్స నేర్చుకొనిరి. అనుభవ జ్ఞానం కొరకు ఆ సాధువు వీరికి ఆ చికిత్స చేయుటయు, తిరిగి గురుదక్షిణగా ఆ సాధువుకు వీరు కాయకల్ప చికిత్స చేయుటయు జరిగినది. అప్పటికి బాబాగారి వయస్సు 90 సంవత్సరాలు. ఈ చికిత్సతో వారి శరీరము తిరిగి యౌవ్వనాన్ని, సంతరించుకొన్నది. ముడుతలు బారిన చర్మము నునుపుగానైనది. తెల్లబడిన వెంట్రుకలు నల్లబడినవి. కండరములు పుష్టిని బొందినవి. పండ్లు గట్టిపడినవి. తదుపరి వారెన్నో మూలికల అద్భుత గుణాలను తెలిసికొనిరి. దేశసంచారము చేయుచు మూలికలతో ఎందరినో ఆరోగ్యవంతులను చేసిరి. 150 సంవత్సరాల వయస్సులో రెండవసారి 365 దినములు కాయకల్ప చేసుకొనిరి. ఈ సారి విచిత్రంగా ఊడిన పండ్లుమరల వచ్చినవి. వైద్యులంతా ఆశ్చర్యచకితులైరి. మూడవసారి ఏటాలో రావుబహుదూర్ ఇంద్రనారాయణ్‌గారి తోటలో కాలిందినది సమీపములో చేసికొనిరి. కొంత శక్తి వచ్చినదే కాని పెద్దమార్పు కనబడలేదు. ఎంతటి వారైనను జరామృత్యువులు తప్పవుకదా !

వీరే క్రీ.శ. 1937 సంవత్సరములో అలహాబాద్‌లో పం. మదనమోహన మాలవ్యగారికి కాయకల్ప చికిత్స చేసిరి. అప్పటికి మాలవ్యగారి వయస్సు 80 సంవత్సరాలు. వీరితోబాటు శ్రీ కృష్ణ శాస్త్రిగారుకూడా చికిత్స చేయించుకున్నారు. ఈ చికిత్స చేసుకొనే సమయంలో ప్రత్యేకంగా నిర్మింపబడిన కుటీరంలో ఏకాంతవాసం చేస్తూ జపధ్యానాదులతో గడుపవలసిఉంటుంది. మొదట కొద్ది రోజులు ఉపవాస, పంచకర్మ (శోధన) ప్రక్రియలు జరుగుతాయి. తదుపరి ఆవుపాలు మూలికల రసం మాత్రమే ఆహారంగా తీసుకోవాలి. ఈ చికిత్స కొన్ని నెలలు చేసుకోవలసి ఉంటుంది. ప్రతిదినం వైద్యుడు మందుల మోతాదును నిర్ణయించవలసి ఉంటుంది. ఈ చికిత్స చాలా ప్రయాసతో కూడినదే అయినను ఫలితము అద్భుతము. శ్రీ మాలవ్యగారు చికిత్స పూర్తియగువరకు ఉండలేక మధ్యలోనే విరమించిరి. కొన్ని ఫలితములను మాత్రమే పొందగలిగిరి. ఆ కొద్ది ఫలితములే ఆధునిక వైద్యులను సంభ్రమాశ్చర్యాలకు గురిచేసినవి. దానితో శ్రీ తపసీబాబా గారు ప్రపంచ ప్రసిద్ధి చెందారు. వీరు చక్కటి ఆధ్యాత్మిక ప్రవక్త. మన ఆంధ్రప్రాంతములో కూడా పర్యటించి ఉపదేశించి యుండిరి. కొందరికి చికిత్సచేసి ఆరోగ్యవంతులను చేసిరి.

నేడు కాయకల్పచికిత్స చేయగల వైద్యులున్నారో లేదో తెలియదు. కేరళలోని కోట్టక్కల్ గ్రామంలో ఆర్యవైద్యశాల వారు ఈ చికిత్స చేస్తూఉన్నట్లు వింటిని. చరక, శుశ్రుతాది ఆయుర్వేద గ్రంథాలలో ఇది రసాయన ప్రకరణంగా చెప్పబడింది. ఈ గ్రంథముల చికిత్సాస్థానములో చికిత్స రెండు విధములుగా ఉంటుందనియు, అందు ఆరోగ్యవంతులకు రసాయన వాజీకరణములు, రోగులకు వివిధ చికిత్సలు తెలుపబడినవి.

స్వస్థస్యోర్జస్కరం కించిత్ కించిదార్తస్య రోగనుత్ ।

(చరక. చికిత్స. 1-1-3)

స్వస్థుడగువానికి అనగా ఆరోగ్యవంతునికి కొంత ఊర్జస్సును - బలారోగ్య యౌవనములను (రసాయనమును) కలిగించునదియు, రోగుల రోగమును హరించునదియు నని ఔషధము రెండు విధములుగా నుండును. అందు రసాయన విధివల్ల కలుగులాభము లెవ్వియన -

**దీర్ఘమాయుః స్మృతిం మేధామారోగ్యం తరుణం వయః ।**
**ప్రభావర్ణస్వరౌదార్యం దేహేంద్రియ బలం పరమ్ ॥**
**వాక్సిద్ధిం ప్రణతిం కాంతిం లభతే నా రసాయనాత్ ।**
**లాభోపాయో హి శస్తానాం రసాదీనాం రసాయనమ్ ॥**

**(చరక. చికిత్సా. - 1-1-7, 8)**

ఆరోగ్యవంతులు రసాయనము సేవించుటవలన వారి ఆయువు వృద్ధిచెందును. జ్ఞాపకశక్తి, బుద్ధికుశలత అలవడును. ఆరోగ్యము, యౌవనము, తేజస్సు, శరీరకాంతి, సుస్వరము, ఔదార్యము, శరీర -ఇంద్రియములకు బలము, వాక్సిద్ధి, లోకవంద్యత, మనోజ్ఞత కలుగును. రసరక్తాది సప్తధాతువులకు పుష్టిని కలిగించి ప్రశస్తములుగ చేయుటకు చేయబడు ప్రయత్నమే రసాయన మనబడును.

తదుపరి ఈ రసాయన ప్రకరణమున కుటీర నిర్మాణ కుటీర ప్రవేశ విధులు, బ్రాహ్మీ ఆమలక భల్లాతకీ పిప్పలీ, త్రిఫలా మొదలగు రసాయన విధులు వివరింపబడినవి. నేడు లోకమున బహుళ ప్రాచుర్యమునొందిన చ్యవన ప్రాశావలేహ్యము, ఆమలక రసాయనాల

లోనిదే. కాలాంతరమున మేధావులైన కొందరు వైద్యులు ఈ రసాయన ప్రకరణాధారముగానే కాయకల్ప చికిత్సను రూపొందించి, ప్రయోగించి ఫలితములు పొంది యుండవచ్చును. అట్టి మేధావీ వైద్యులలోని వారే చరిత్రలోని అశ్వినీదేవతలు కావచ్చును. ఏలన, ఆయుర్వేద గురుపరంపరను పరిశీలించిన ఈ విధముగా కనబడును.

## ఆయుర్వేద ఆవిర్భావము :

భారతీయ ఆర్యులందరు సమస్త విద్యావిజ్ఞానములకు మూలము పరమేశ్వరుడని నమ్మెదురు. సర్వేశ్వరుడు ప్రథమ మానవ సృష్టి సమయమున సామాన్య మానవులతో బాటు పూర్వసృష్టిలో సిద్ధిని బొందినవారిని ఋషులుగా జన్మింపజేసెను. అందు యోగ్యులైన నలుగురు ఋషులకు సృష్టి విజ్ఞానమంతయు ఉపదేశించెను. ఆవిజ్ఞాన గ్రంథములే చతుర్వేదములు. ఆది ఋషులైన అగ్నిఋషికి ఋగ్వేదము, వాయుఋషికి యజుర్వేదము, ఆదిత్యఋషికి సామవేదము, అంగిర ఋషికి అథర్వవేదము ఉపదేశించెను. అందుచే సమస్త విద్యలకు ఆదిగురువు పరమేశ్వరుడు. కాలాంతరమున గొప్ప ధారణశక్తిగల బ్రహ్మయను ఋషి పై నలుగురు ఋషులనుండి నాలుగు వేదములను గ్రహించి చతుర్వేదియయ్యెను. ఆ బ్రహ్మఋషినుండి మేధావులైన మానవులు వారి వారి యోగ్యత, అభిరుచులనుబట్టి ఆయా విద్యలను అధ్యయనం చేసిరి. తదుపరి ఆయా విద్యలను మనన చింతన నిధిధ్యాసనములు చేసి ఋషులైరి.

ఆయుర్వేద శాస్త్రమును ప్రారంభమున ఆది ఋషియైన బ్రహ్మఋషి నుండి దక్షప్రజాపతి గ్రహించెను. దక్షప్రజాపతినుండి అశ్వినీదేవతలు గ్రహించిరి. వారి నుండి దేవతల రాజైన ఇంద్రుడు

గ్రహించెను. కాలాంతరమున మానవులలో రోగములు ప్రబలుట గాంచి ఆనాటి ఋషులు కొందరు ఆవేదన చెంది హిమవత్పర్వత ప్రాంతమున పెద్ద సభచేసిరి. అందు లోక కల్యాణార్థం ఇంద్రుని నుండి ఆయుర్వేదము నభ్యసింప మహామేధావియైన భరద్వాజ ఋషిని ఎన్నుకొనిరి. అతడు దేవతల రాజైన ఇంద్రుని సమీపించి ఋషుల విజ్ఞాపనమును వినిపించి, ఆయుర్వేదము నుపదేశింప అర్థించెను. ఇంద్రుడు కనికరించి ఉపదేశించెను.తదుపరి భరద్వాజుడు కొందరు ఋషులకు ఉపదేశించుటయు, గురుశిష్య పరంపరగా లోకమున ఆయుర్వేదము వ్యాపించుటయు జరిగినది. కాలాంతరమున మరికొందరు ఋషులు ఇంద్రుని సమీపించి **మానవులకు ముసలితనమును దూరము చేసి దీర్ఘాయువును** ప్రసాదించగల **రసాయన చికిత్సను ఉపదేశింపు** డని అర్థించిరి. అందుకు ఇంద్రుడు - **ఆత్మనః ప్రజానాం చానుగ్రహార్థ మాయుర్వేద మశ్వినౌ మహ్యం ప్రాయచ్ఛతాం, ప్రజాపతి రశ్విభ్యాం, ప్రజాపతయే** బ్రహ్మ...... **(చరక రసాయన 4-4)"** అని గురుపరంపరను స్మరించి వివిధ రసాయన విధులను ఉపదేశించినట్లుగా ఆయుర్వేద శాస్త్రములందు కనబడును. పై గురుపరంపరను పరిశీలించిన పూర్వకాలమున **అశ్వినీదేవత** లని ప్రసిద్ధిపొందిన ఇద్దరు మేధావీ వైద్యులు ఉండెడివారని తెలియుచున్నది.

ఇక సుశ్రుతమును పరిశీలించిన ఈ శాస్త్ర మూలపురుషుడు ధన్వంతరి. ఇది ఆ ఋషిపేరు కావచ్చును లేదా శల్యశాస్త్రం అని కూడా కావచ్చును. ఏలన - వ్యాకరణానుసారం **ధనోః** = శల్యశాస్త్రస్య, **అంతం** = ఇయర్తి ఇతి ధన్వంతరిః అని అవుతుంది. కనుక శల్య

శాస్త్రంలో ఆరితేరిన వాడగుటచే ఆ ఋషికి పేరు ఉపాధిగా వచ్చియుండవచ్చును. ఆనాటి కాశీరాజైన దివోదాసుడు శల్యశాస్త్ర పారంగతుడుకూడా అగుటచే అపర ధన్వంతరిగా కీర్తింపబడ్డాడు. అతడు రాజర్షిగా తదుపరి వానప్రస్థాశ్రమము స్వీకరించి బ్రహ్మర్షిగా కొనియాడబడ్డాడు. అట్టి దివోదాసఋషి వద్దకు ఎనమండుగురు. ఋషులు వచ్చి వైద్యశాస్త్ర ఉపదేశము చేయుడని కోరిరి. అందు సుశ్రుతుడను ఋషి ప్రధానమైనవారు. మహా మేధావి. వారు కాలాంతరమున గురూపదేశమునకు తన అనుభవమును చేర్చి సుశ్రుతమను అద్భుత వైద్యశాస్త్రమును రచించెను.

నేడు వారు లేకున్నను గురుశిష్యపరంపరగా నేటికిని వారి జ్ఞానము గ్రంథములద్వారా లభించుచున్నది. విదేశీయుల విద్వేషాగ్నికి ఆహుతిగా లక్షలాది గ్రంథములు నశించిపోయినా కొన్ని మిగిలి యున్నవి. అందు చరక సుశ్రుతములు ముఖ్యమైనవి. అందు చరక సంహిత ప్రముఖముగా ఔషధ ప్రయోగము (Medicine) ను వివరించును. సుశ్రుత సంహిత శస్త్ర చికిత్సను (Surgery) వివరించును. కనుక ఈ రెంటిని కలపివానిని నేడు మన మధ్య ఉన్న అశ్వినీ దేవత లనవచ్చును.

## భారతీయ శస్త్ర చికిత్సల ఔన్నత్యము

ఆంగ్లేయులు రాకపూర్వము మన దేశములో ఔషధ, శస్త్రచికిత్సలు రెండును మహోన్నతదశలో ఉండేవి. ఆంగ్లేయుల కాలములోనే అవి క్షీణించిపోయినవి. ఈ విషయం ఆంగ్లేయుల కాలమునాటి ఒక సంఘటనవల్ల మీకు స్పష్టమవుతుంది.

చెన్నై (మద్రాసు) ప్రాంతంలో ఒక గ్రామానికి ఒక ఆంగ్లేయ

అధికారి వచ్చి అందరిని దుర్భాషలాడుతూ హింసిస్తూ ఉండగా ఒక యువకునికి పట్టలేనంత ఆగ్రహం వచ్చింది. వెంటనే ఆ యువకుడు పరుగెత్తుకుని వెళ్ళి కత్తితో ఆ ఆంగ్లేయాధికారి ముక్కును కోసివేసెను. అంతట ఆ అధికారి తెగిపడిన తన ముక్కును చేతబట్టుకొని గగ్గోలుపెడుతు విలపిస్తూ ఉండటం చూచి కొందరికి దయ కలిగింది. అతనిని ఒక మంగలి యింటికి తీసుకువెళ్ళిరి. ఆ మంగలి అతని ముక్కును యథాస్థానంలో చక్కగా నమర్చి పైన పసరుపూసి, శ్వాస తీసుకొనుటకు తగిన ఏర్పాటుచేసి పైనుండి కట్టుకట్టి యింటికి పంపెను. అప్పుడు రక్తము కారుట ఆగిపోయి క్రమంగా బాధోపశమనం కలిగింది. కొద్ది దినముల తదుపరి కట్టు విప్పిచూడగా ఆ ముక్కు అద్భుతంగా, అతికిన గుర్తులు ఏమాత్రం కనబడకుండా చక్కగా అతుక్కు పోయినది. కొంతకాలం తదుపరి అతడు అతని స్వదేశానికి (ఇంగ్లాండుకు) వెళ్ళి శస్త్రచికిత్స నిపుణులకు (Surgeon కు) చూపగా అచ్చటి చికిత్సకులు పరీక్షించి ఆశ్చర్యపడిరి. భారతీయుల శస్త్రచికిత్సా నైపుణ్యాన్ని కొనియాడ కుండా ఉండలేకపోయారు. ముఖ్యంగా ఆ ప్లాస్టిక్ సర్జరీని (Plastic Surgery) ఒక గ్రామ మంగలి చేయగలగడం గొప్పవిశేషమే.

ఇది కల్పితము కాదు. చారిత్రక సత్యమే. ఆంగ్లేయుల పాలన నాటికి మనదేశం విద్యావిజ్ఞానాలలో ఎంతో మహోన్నత దశలో ఉండేది. ఇందుకు వారు (ఆంగ్లేయులు) వ్రాసిపెట్టుకున్న దస్తావేజు (Documents) లే ప్రమాణం. ప్రసిద్ధ ఇతిహాసకారులు శ్రీ ధర్మపాల్‌జీ కొన్ని సంవత్సరాలు లండన్‌లో ఉండి ఎంతో వ్యయ ప్రయాసలకోర్చి ఈ దస్తావేజులను సంపాదించారు. ఇంగ్లాండు దేశంలోని బ్రిటిష్ పార్లమెంట్

(లండన్) మరియు ఇండియా ఆఫీస్ (లండన్)లలోని దస్తావేజుల (Archives) ను అధ్యయనం చేసి, అందు ముఖ్యమైన వాటి ప్రతిలిపులను (Xerox Copies) చేయించి తీసుకువచ్చారు. వాటి సంఖ్య సుమారు యాభైవేలు (50,000) వరకు ఉంటుంది. వాటిని ప్రచురించే ప్రయత్నంలో కూడా ఉన్నారు.

ఆ దస్తావేజుల ప్రకారం - భారతీయుల మహోన్నత సంస్కృతీ సభ్యతలకు ఔన్నత్యానికి మూలాధారమేమిటో తెలిసికొని దానిని అణచివేయాలని ఆంగ్లేయులు లార్డు మెకాలేను పిలిపించారు. అతడు 15, 16 వందల మంది ఆఫీసర్లను నియమించి నిరీక్షణ (సర్వే) చేయించాడు. అందులో ఆనాటి భారతీయ ఔన్నత్యానికి అప్పటి శిక్షా వ్యవస్థ (గురుకుల వ్యవస్థ) మరియు న్యాయవ్యవస్థ మూలాధారమని వెల్లడయ్యింది. అందు శిక్షావ్యవస్థను నశింపజేయు బాధ్యతను లార్డుమెకాలేకు అప్పగించారు. అతడు వేలాదిమంది ఉద్యోగులను నియమించి విద్యాలయాల సంఖ్యను సేకరించాడు. ఆ గణాంక వివరాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

ఆంగ్లేయుల పాలన ప్రారంభం నాటికి (1835-40 మధ్యలో) మద్రాసు రాష్ట్రం చాలా పెద్దగా ఉండేది. ఆంధ్ర, కేరళ రాష్ట్రాలు కూడా కలిసి నేటి భారతదేశంలో 1/3 వంతుగా చాలా విశాలంగా ఉండేది. అప్పుడు దానిని మద్రాసు ప్రెసిడెన్సీ (Madras Presidency) గా వ్యవహరించేవారు. అట్టి రాష్ట్రంలో ఒక లక్షాయాభైవేల (1,50,000) కాలేజీలు ఉండేవి. (ఇవి సామాన్య పాఠశాలలు కాదు ఉన్నత విద్యలు బోధించే గురుకులాలు) వీటిని వారు వారి భాషలో హయ్యర్ లెర్నింగ్ ఇన్‌స్టిట్యూట్స్ (Higher Learning Institutions) అని వ్రాసి పెట్టుకున్నారు

అప్పటి రెవిన్యూ లెక్కల ప్రకారం మద్రాసు ప్రెసిడెన్సీలో ఒక లక్షా యాభై ఏడువేల (1, 57,000) గ్రామాలు ఉండేవి. అనగా ప్రతి గ్రామానికి ఒక కళాశాల ఉండేది. వాటిలో కేవలం వైద్యపరమైన శస్త్రచికిత్సను నేర్పే కళాశాలల (Surgery Colleges) సంఖ్య పదిహేను వందలు (1500). ఈ కళాశాలలలో బోధకులు (Lecturers) గా ముఖ్యంగా నాయీలు (మంగలివారు) ఉండేవారట. అంటే, నేడు వెనుకబడిన వర్ణాలు (Backward Classes) గా చూడబడే నాయీలు నాడు గురువులుగా ఉండేవారు. ఇక వారివద్ద నేర్చుకునే విద్యార్థులు అన్ని వర్ణాల వారితోబాటు ముప్పైశాతం (30%) బ్రాహ్మణులుండేవారు.

ఆంగ్లేయులు వ్రాసిపెట్టుకున్న పై లెక్కలనుబట్టి మనకు తెలిసిందేమంటే - ఆంగ్లేయులు రాకపూర్వం మనదేశంలో విద్యవిజ్ఞానాలు మహోన్నతదశలో ఉండటమేకాక సమానత్వం - సమ సమాజం ఉండేవి. ఔషధ శస్త్రచికిత్సలేకాక సాంకేతిక విజ్ఞానం (Technology) అంతా ఎక్కువ శాతం నేడు వెనుక బడిన వర్గాలు (శూద్రులు) అని చెప్పబడేవారి చేతులలోనే ఉండేది. మన పూర్వులైన కమ్మరులు, కుమ్మరులు, వడ్రంగులు, చేనేతవారు అద్భుతాద్భుతాలను సృష్టించేవారు. ఒక చేనేత శిల్పి (కళాకారుడు) అగ్గిపెట్టెలో ఇమిడిపోగల అతినాజూకైన పట్టుచీరను నేసి అగ్గిపెట్టెలో పెట్టి నాటి విక్టోరియా మహారాణికి బహుకరణగా పంపిన సంఘటన నేటికివారు వ్రాసిపెట్టుకున్న చరిత్రలోనిలిచి ఉంది. ఎన్నెన్నో కాలగర్భంలో కలిసిపోగా నేటికీ తుప్పుపట్టని లోహస్తంభాలు కొన్ని యింకా నిలిచి ఉన్నాయి. మరికొన్ని తరాలవరకు నిలిచిఉండగల దేవాలయాది కట్టడాలు మిగిలిఉన్నాయి.

దక్షిణ భారతదేశం అద్భుతమైన శిల్పకళతో కూడిన విశాలమైన దేవాలయాలకు ప్రసిద్ధి. వీటిని నిర్మించినది ఎవరో తెలుసా ? నేడు వెనుకబడిన వర్గంవారుగా పేర్కొనబడుచున్న పెరియార్‌లే. మహ్మదీయులు కత్తితో నరికివేయగా మిగిలిన వివిధ కళాకారులను ఆంగ్లేయులు తమ కుటిల రాజనీతితో శాశ్వతంగా అణచివేసారు. విభజించి పాలించటమనేది వారి రాజనీతిలో బాహ్య ప్రయత్నమైతే ఆ దేశపు సంస్కృతీ సభ్యతల మూలాధారమేమిటో తెలిసికొని దానిని శాసనంతో అణచివేయటం పరోక్ష ప్రయత్నం. ఏ దేశాన్ని వారు బానిస చేసుకోవాలనుకున్నారో ముందుగా ఆ దేశాన్ని వారు మేధావులతో సర్వేచేయించేవారు. (పై లెక్కలన్నీ అట్టి సర్వేలో వెల్లడైనవే). తదుపరి వాటిని అణచివేయుటకు తగిన శాసనాలు చేసేవారు. మేము శాసన పాలన చేస్తున్నామంటూ బలవంతంగా వారి వృత్తులను, కళా కౌశలాలను అణచివేసేవారు. ఇంజినీరింగ్ (వివిధ యంత్రాదుల నిర్మాణ కళ) ఆర్కిటెక్చర్ (గృహనిర్మాణకళ)లలో ప్రావీణ్యులైన పెరియార్‌లను, ఔషధ శస్త్ర చికిత్సలలో ఆరితేరిన మంగలివారిని (నాయీలను) ఆ విధంగానే అణచివేసారు. లేకున్న మనదేశంలో అభియంతలు ( Engineers) అశ్వినీదేవతలు (ఔషధ శస్త్ర చికిత్సకులు Physicians and Surgeons) కోకొల్లలు .

# ప్రాచీన గురుకులాల ఔన్నత్యము - ఆదర్శము

ఆంగ్లేయుల పరిశీలన (సర్వే)లో వెల్లడైన అతి ముఖ్యమైన విషయం ఏమంటే - నాటి సంస్కృతీ, సభ్యతలకు, విద్యావిజ్ఞానాలకు, కళాకౌశలాలకు మూలాధారం అప్పటి గురుకుల విద్యావిధానమే. నిస్స్వార్థంగా, నిశ్శుల్కంగా నడిచే ఆదర్శ గురుకులాలు గ్రామగ్రామాన ఉండేవి. సేవాభావంతో అంకితమై పనిచేసే ఆయా విద్యలలో ప్రావీణ్యులైన వానప్రస్థులు గురువులుగా ఉండేవారు. బీద, ధనిక భేదం లేకుండా విద్యార్థుల నందరిని తమ బిడ్డలుగా భావించి ఆదరించేవారు. కుల వర్గాల ప్రసక్తి అసలు లేనే లేకుండెను. స్నాతకులు (విద్యపూర్తి) అయిన తదుపరియే వారివారి విద్యా యోగ్యతలను అభిరుచులనుబట్టి, ఎంచుకున్న వృత్తులను బట్టి వర్ణాలు ఏర్పడేవి. అట్టి మూలాధారమైన గురుకుల విద్యావిధానాన్ని నశింపజేయుటకు వారు ముందుగా కాన్వెంటు బడులను తెరిచారు. ప్రజలు ప్రారంభంలో వాటిని ఎంతగానో వ్యతిరేకించారు. కాన్వెంటు అంటే అనాథుల సేవచేసే సంన్యాసినుల మఠం అని అర్థం. వారి ఇంగ్లాండు దేశంలో వైవాహిక బంధం కుటుంబ వ్యవస్థ నామమాత్రం. పెండ్లిండ్లు విడాకులు మరల మరియొకరితో పెండ్లి, మళ్ళీ విడాకులు - ఈ చక్రం జీవితాంతం కూడా కొనసాగించవచ్చు. అందుచేత వారి పిల్లలు తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోక వీధిబాల లౌతారు. అట్టివారి కోసమే ప్రభుత్వం ఈ కాన్వెంట్లులను తెరిచింది. అవి ఒకరకంగా అనాథాలయాలే. అట్టి అనాథాలయాలకు తమ పిల్లలను పంపటానికి భారతీయులు వ్యతిరేకించారు.

ఆంగ్లేయులచే అణచివేత :

లార్డు మెకాలే సూచనల మేరకు ముందుగా ఇండియన్ ఎడ్యుకేషనల్ యాక్ట్ అనే శాసనాన్ని పార్లమెంటుద్వారా అమోదింప చేసారు. ఆ చట్ట ప్రకారం అనాటి ఆదర్శ గురుకులాలన్నిటిని చట్టవ్యతిరేక (Illegal) పాఠశాలలుగా ప్రకటించారు. అంతేగాక, అట్టి పాఠశాలలకు దానం చేసేవారిని నేరస్థులుగా పరిగణించి బాధించారు. దానితో క్రమంగా ఆ గురుకులాలన్నీ మూతబడ్డాయి. వాని స్థానంలో కాన్వెంటులను తెరిచారు. మొదటి కాన్వెంటు కలకత్తాలో తెరువబడింది. కాని, అందులో పిల్లలను చేర్చ ఎవరు ముందుకు రాలేదు. అప్పుడు తమ ఈస్టిండియా కంపెనీలో ఉద్యోగస్థుడుగా ఉన్న శ్రీ రాజారామ మోహన్‌రాయ్ పదవిని పెంచి (ప్రమోషన్ యిచ్చి) పిల్లలను చేర్పించే పని అతనికి అప్పగించారు. అతడు అనాటి కొన్ని సాంఘిక దురాచారాలను రూపుమాపిన సంఘ సంస్కర్తయైనప్పటికి అతనికి ఆంగ్లేయ విద్యావిధానంపైన సంస్కృతీ సభ్యతలపైన ఎనలేని భక్తి శ్రద్ధలు ఉండేవి. అతని సహకారం వల్లనే లార్డుమెకాలే విద్యావిధానం మనదేశంలో వ్యాప్తి చెందింది.

అతని సూచనల మేరకు 1881 ప్రాంతంలో కాన్వెంటు స్కూలు పదాన్ని మార్చి ప్రభుత్వ ఉచిత పాఠశాలలుగా వాటిని వ్యవహరించారు. క్రమంగా అట్టివి దేశమంతా వ్యాపించాయి. లార్డు మెకాలే రూపొందించిన విద్యావిధానంలో భారతీయ సంస్కృతీ సభ్యతలకు గాని, భారతీయుల ఆత్మ గౌరవాన్ని పెంచే మన ప్రాచీన చరిత్రకు గాని స్థానం లేనేలేదు. వాటి స్థానంలో వారి సంస్కృతీ సభ్యతలను వారిగొప్పలు తెలిపే ప్రపంచ చరిత్రలను చేర్చారు. మన దైవ ప్రార్థనల

స్థానంలో వారి ఏసుక్రీస్తును కూర్చోబెట్టి బాలల హృదయాలల్లో క్రైస్తవమతాన్ని నింప ప్రయత్నించారు. ఇంతేకాక మన వేద శాస్త్రాల పైన ఏవగింపు కలుగజేసారు. జర్మనీదేశపు మాక్సుముల్లర్ పండితునిచే వేదాలకు వక్రభాష్యం వ్రాయించి దానిని ప్రచారం చేసారు.

వీటన్నిటి పర్యవసానంగా మన సంస్కృతికి, విద్యావిజ్ఞానాలకు మూలాధారమైన వేదాలపై చిన్నచూపు కలిగింది. దానితో క్రమంగా జాతి నిర్వీర్యమై పతనమై పోయింది. విద్యావిజ్ఞానాలు మరుగున పడిపోయాయి. భౌతిక సంపదంతా రకరకాల పన్నులతో దోచుకోబడింది. ఇట్లు దేశం నిరుపేద బానిస దేశంగా మారిపోయింది.

అట్టి పరిస్థితులలో మన అభియంతలు, అశ్వినీ దేవతలు పెక్కు కడగండ్లకు లోనైపోయారు. నాడు ఒక్క ఈస్టిండియా కంపెనీయే దోచుకుంటే నేడు అనేక విదేశీ కంపెనీలు మనల్ని దోచుకుంటున్నాయి. బహిరంగంగా కోట్లాది రూపాయలు ఆర్జించి వారి వారి దేశాలకు తీసుకుపోతున్నాయి. ఇకనైనా జాతి జాగృతమై స్వదేశీ వస్తువులనే వాడుకోవడం శ్రేయస్కరం.

ఈ పై విషయాలు వివరంగా, సప్రమాణికంగా తెలుసుకో గోరేవారు **ఆజాదీ బచావో ఆందోళన** వారు ప్రచురించిన, ప్రచురిస్తున్న సాహిత్యం చదవండి. వారి ఉపన్యాసాల కేసెట్లు వినండి. చిరునామా **ఆజాదీబచావో ఆందోళన** గాంధీ భవన్, చౌథమ్ లాయిన్స్, అలహాబాద్ - 211 002. ఈ ఉద్యమ స్థాపకులు శ్రీ ధర్మపాల్ గారు. వీరు సేకరించిన పుస్తకాలు, దస్తావేజులు, మొదలైన వాటి నన్నిటిని చదివి శ్రీ రాజీవ్ దీక్షిత్‌గారు ఓజస్వంతమైన ఉపన్యాసాలు ఇస్తూ మధ్యభారతమంతా పర్యటించుచున్నారు. అవి ప్రతి భారతీ...

తప్పక వినతగినవి.

ఇవి కేసెట్ల రూపంలో చాలా తక్కువ ధరకే లభిస్తున్నవి. చిరునామా : అరిహంత్ ఎలక్ట్రానిక్స్, 16, ఓంనివాస్, మొదటి అంతస్థు, (ఫస్ట్‌ఫ్లోర్) 2nd పాంజారాపోల్ లేన్ సి.పి. టాంక్, ముంబాయి.

ఇక మనం మన ప్రాచీన అశ్వినీదేవతల గురించి మరికొన్ని విషయాలు తెలిసికొందాము.

## ప్లాస్టిక్ సర్జరీ ఆవిష్కర్తలు భారతీయులే

పై మాటలు ఆంగ్లమానస పుత్రులకు అతిశయోక్తులుగా అనిపించవచ్చును. కాని, ఈ మాటలు వ్రాసుకొన్నది ఆంగ్ల వైద్యులే. ఆ మాటలేవో తెలిసికోబోయేముందు ఒక చారిత్రిక సంఘటనను తెలిసికోవటం అత్యవసరం.

ఆంగ్లేయుల పాలన కాలంలో మన దక్షిణ భారతదేశంలోని కొంత ప్రదేశాన్ని హైదరాలీ అనే బలమైన మహ్మదీయ చక్రవర్తి పరిపాలించేవాడు. అతనిని జయించటం ఆంగ్లేయులకు అసాధ్య మయ్యింది. అందుచే ఇంగ్లాండునుండి అనేక యుద్ధాలు చేసి ఆరితేరిన కర్నల్ కూట్ అనే సైనికాధికారిని హైదరాలీతో పోరాడ భారతదేశం పంపారు. అతడు ఎన్నో ప్రగల్భాలు పలుకుతూ ఎంతో యోజనతో హైదర్‌పై దండయాత్రకు బయలుదేరాడు. కాని, ఓడిపోయి హైదరాలీ చేతికి చిక్కాడు. హైదర్ అతనిని చంపటం కన్న అవమానించి పంపటమే మంచిదనుకున్నాడు. అతను ముక్కును కోసివేసి మీ ఇంగ్లాండుకుపోయి హైదర్ ప్రతాపానికి సాక్షిగా అవమానంతో జీవించ మని చెప్పి వదిలివేసాడు. అంత అతడు ప్రాణా లరచేతబట్టుకొని పరుగులుతీస్తూ హైదర్ రాజ్యాన్ని దాటి

మద్రాసు ప్రాంతపు ఒక గ్రామానికి చేరుకుని ఆశ్రయం కోరాడు. ఒక జాలిగల భారతీయుడు అతనికి ఆశ్రయ మిచ్చుటయే గాక తెగిన ముక్కుకు చికిత్సచేయించ ఒక భారతీయ (ఆయుర్వేద) శస్త్ర చికిత్సకుని వద్దకు తీసుకువెళ్ళాడు. ఆ వైద్యుడు ముక్కుకు ఏమైనదని అడిగితే యుద్ధం చేసేటప్పుడు తెగిపోయిందని అబద్ధం చెప్పాడు. ఆ వైద్యునికి ప్లాస్టిక్ సర్జరీ కూడా తెలుసును. అతడు జాలిపడి వేరే భాగం నుండి అతని కండరాన్ని తీసి అతని ముక్కును యథా ప్రకారం చేసి పంపాడు. ఆ అద్భుత శస్త్ర చికిత్సకు 1 1/2 గంటలు పట్టిందని కర్నల్ కూట్ తన చరిత్రలో వ్రాసుకున్నాడు. కొంత కాలం తదుపరి అతడు ఇంగ్లాండుకు వెళ్ళిపోయాడు.

ఇంగ్లాండులో ఒక ప్రసిద్ధి చెందిన శస్త్ర చికిత్సకుడు (Surgeon) కర్ణల్ కూట్‌నకు స్నేహితుడు. అతని దగ్గరకు వెళ్ళి **నీకు తెలిసిన శస్త్రచికిత్స చాలా స్వల్పం మాత్రమే. భారతదేశంలో నీ కన్న గొప్ప శస్త్రచికిత్సకులున్నారు. వారి వద్ద నీవు నేర్చుకోవలసింది చాలా ఉంది** అన్నాడు. అంత ఆ వైద్యుడు ఆశ్చర్యపోయాడు. తదుపరి కర్నల్‌కూట్ జరిగిన వృత్తాంతమంతా వివరించాడు. ఆ శస్త్రచికిత్సకుడు కర్నల్‌కూట్ ముక్కును జాగ్రత్తగా పరీక్షించి అతను అన్నది సత్యమేనని అంగీకరించాడు. కొంతకాలం తదుపరి ఆ శస్త్రచికిత్సకుడు భారతదేశానికి వచ్చి, కొన్ని సంవత్సరాలు ఇక్కడ ఉండి ప్లాస్టిక్ సర్జరీకి చెందిన మెలకువలన్నీ నేర్చుకుని వెళ్ళాడు. ఆ తదుపరి పాశ్చాత్యవైద్యుల దృష్టి భారతీయ ఆయుర్వేదం వైపు మరలింది. వారు చరక, సుశ్రుతాది గ్రంథముల నధ్యయనము చేసి ఎన్నెన్నో విషయాలను గ్రహించారు. వివేకవంతులైన వైద్యులు వాటిని

కొనియాడకుండా ఉండలేకపోయారు. ఆ ప్రశంసలేవో తెలిసికోబోయే ముందు మన సుశ్రుతములో నాసానుసంధాన శస్త్ర చికిత్స ఎట్లు చెప్పబడెనో తెలిసికొనుట మరింత ఆసక్తి దాయకముగా నుండును కదా! అందుచే ముందుగా దానిని తెలిసికొందాము.

**తెగిన ముక్కును తిరిగి సరిచేయు విధానము**

**శ్లో ॥ విశ్లేషితాయా స్త్వథ నాసికాయా**
**వక్ష్యామి సంధానవిధిం యథావత్ ।**
**నాసాప్రమాణం పృథివీరుహాణాం**
**పత్రం గృహీత్వా త్వవలంబితస్య**
**తేన ప్రమాణేన హి గండపార్శ్వా**
**దుత్కృత్య బద్ధం త్వథ నాసికాగ్రమ్,**
**విలిఖ్య చాశు ప్రతిసందధీత**
**తత్ సాధుబంధైర్భిషగప్రమత్తః.**
**సుసంహితం సమ్యగతో యథావన్నాడీద్వయేనాభిసమీక్ష్య బద్ధ్వా, ప్రోన్నమ్యచైనామవచూర్ణయేత్తు పతంగయష్టీమధుకాంజనైశ్చ, సంఛాద్య సమ్యక్ పిచునా సితేన తైలేన సించేదసకృ త్తిలానామ్, ఘృతం చ పాయ్యః స నరః సుజీర్ణేస్నిగ్ధో విరేచ్యః స యథోపదేశమ్. రూఢం చ సంధాన ముపాగతం స్యా త్తదర్ధశేషం తు పునర్నికృంతేత్**
**హీనాం పునర్వర్ధయితుం యతేత**
**సమాం చ కుర్యాదతివృద్ధమాంసామ్.**

తా. ప్రసంగవశమున ముక్కు తెగిపోయినప్పుడు దానిని తిరిగి యతుకువిధానము నిటుపిమ్మట జెప్పుచున్నాము. చెట్టుయొక్క ఆకును దీసి తెగియున్న ముక్కుభాగమునకు సరిగాకొలతపెట్టి

అంతప్రమాణముగల చర్మమాంసములతో గూడినపొరను దగ్గరగా నుండు చెక్కిలిభాగమును క్రిందనుండి మీదకుకోసి మీదభాగమున పట్టుండు నట్లుంచి యా పొరను ముక్కుయొక్క ఆదివరకు మొండితేరిన అంచున శస్త్రముతో గీచి రక్తము స్రవించునట్లు చేసి దానితో నంచులనతికి నాసారంధ్రములకు రెండికిని తేలికగా గాలి ఆడుటకు గొట్టములను (లేక రబ్బరు గొట్టములను) జొనిపియుంచి పైనిముక్కు యొక్క ఆకారమునకు సరిగా నాకండపొరనుసరిదిద్ది అప్రమత్తతతో శీఘ్రముగా మీదికెత్తి సూత్రాదులతో జక్కగా బంధనమును జేసి దానిపైని రక్తచందనము, యష్టిమధుకము, రసాంజనము వీని చూర్ణమును చల్లి ఆపైని తెల్లనిదూదిపింజతోగప్పి నువ్వులనూనెను మాటిమాటికివేసి తడుపుచుండవలెను. మఱియు నావ్యాధితునికి జీర్ణముకా తగినంతనేతిని పానము జేయించి స్నిగ్ధుడైన తరువాత శాస్త్రానుసారముగా విరేచనమును జేయింపవలెను.

ఇట్లుచేయుచు చక్కగా నాపొర అతుకుకొనినతరువాత నదివరకు గండభాగము నందుంచినపట్టును కొంచెము విశేషముండునట్లు ఛేదింపవలెను. ఇట్లు చక్కగా నతుకుకొనిన తరువాత కొంచెము కృశించియున్నచో వెనుక కర్ణపాలివర్ధనోపయుక్త తైలాదిచికిత్సల చేత నాభాగమును పెరుగునట్లు చేయవలెను. ఎక్కువగా వృద్ధినొందిన మాంసము కలిగి యున్నచో సమముగా నుండునట్టి యుపాయమును జూచి తగ్గించి సరిచేయవలెను (అట్లు చేయుటలో నొకప్పుడు శస్త్రమునుగూడ వాడుకచేయవలసినచో బాగుగామాని పచ్చి లేకుండచూచి చేయవలెనను సంగతి కర్ణపాలి చికిత్సవలన దెలియవలసియున్నది. మఱియు గండముతోబాటు

అవశ్యకమునుబట్టి లలాటభాగమునందలి మాంసపు పొరను గూడ కోసి యతుకవలసి యుండునని హారణచంద చక్రవర్తి వ్రాసెను)

పెదవులు తెగినచో నమర్చువిధానము

శ్లో॥ నాడీయోగం వినౌష్ఠస్య నాసానుసంధానవద్విధిమ్,
యఏవమేవ జానీయాత్ స రాజ్ఞః కర్తుమర్హతి. 53

తా॥ ముక్కు నతుకువిధానమునే పెదవులనతుకుటకును అనుసరింపవలెను. కాని గొట్టములను మాత్రము జొనుపవలసినపనిలేదు. ఈ విధముగా నీ చికిత్సలను (అద్భుతముగా) జేయుట కెవడు అలవాటు కలిగియుండునో అట్టి శల్యచికిత్సకుడు రాజుల చేతను పూజింపదగియుండును

(సుశ్రుత - సూత్రస్థానం - 16-48 నుండి 53వరకు)

పై ప్రమాణం కేవలం అన్ని వ్యాధులకు చికిత్సలు తెలిపే ఆయుర్వేద గ్రంథమైన సుశ్రుతము లోనిది మాత్రమే. పూర్వకాలంలో ప్రత్యేకం శస్త్రచికిత్సలు మాత్రమే తెలిపే ఆయుర్వేద గ్రంథాలు ఎన్నో ఉన్నట్లు ప్రమాణాలు కనబడతాయి. అవి అన్నీ విదేశీయుల విద్వేషాగ్నికి ఆహుతియైపోయాయి. అయినా, మిగిలిఉన్న ఆ సుశ్రుత శాస్త్రమే విదేశీయులైన వైద్యులను, విద్వాంసులను ఎంతగానో ప్రభావితం చేసింది. పాఠకుల ప్రేరణ కొరకు వాటిలో కొన్నిటిని యిచ్చుట ఉదహరిస్తున్నాము. ఘాణేకర్‌గారు సుశ్రుతసంహిత సూత్రస్థానము 16వ అధ్యాయము 52 శ్లోకవ్యాఖ్యాన సందర్భమున నీక్రింది విధముగ వ్రాసియున్నారు. ఈ అధ్యాయమున కర్ణపాలీ, నాసా, పెదవి తెగినపుడు శరీరముయొక్క ఇతర అవయవములనుండి చర్మము తీసికొని దానితో ఆ తెగిన అవయవములను అనుసంధానము చేయు యుక్తి దానితోపాటు ఆ చికిత్సకుల శస్త్రకర్మయొక్క అపూర్వనైపుణ్యము

వర్ణించబడినది. ఇది ఆధునిక శల్యవిజ్ఞానము నందలి సంధాన విభాగము (Plastic Surgery) నకు మూలము. ఏలన వాటి పరిజ్ఞానము తరువాతనే ఐరోపావాసులైన శల్య చికిత్సకులకు శస్త్రకర్మ (Plastic Surgery) చేయు ఊహ జనించినది మరియు ప్రోత్సాహము లభించినది. The Plastic Surgery of the 19th Century was stimulated by the example of Indian methods. (Dr. Nuberger's History of Medicine)

నేటి 19వ శతాబ్దపు అనుసంధాన చికిత్స భారతీయ శస్త్రకర్మ పద్ధతులవలననే ప్రేరేపింపబడినది.

నాసానుసంధానకర్మ (Rhinoplastic Operation) సుశ్రుతములో వర్ణించిన పద్ధతి ననుసరించియే ఆధునిక శల్య శాస్త్రమున అనుకరించ బడినది. ఆ పద్ధతి (Indian Method) అనియే పేర్కొన బడుచున్నది.

They have already borrowed from them the operation of rhinoplasty. (Weber's History of Medicine.)

ఆ తరువాత ఐరోపాయందలి ఇటలీ, ఫ్రాంసు, తదితరదేశముల శల్య చికిత్సకులు నాసానుసంధానమునకు సంబంధించిన యుక్తుల నుపయోగించి క్రొత్తక్రొత్త పద్ధతుల నావిష్కరించిరి. కొంతకాలము వరకు ఉపయోగించిరి. కాని వాటిలో ఇసుమంతయు గొప్పతనము లేకపోవుటచే అవి వెనుకబడిపోయినవి. ఈనాడు భారతీయ పద్ధతి నామముతో సుశ్రుతముయొక్క పద్ధతియే ముఖ్యముగా ప్రచలితమైనది. రోజ్ మరియు కార్లేస్‌చే వ్రాయబడిన సౌశ్రుతీ (Rose and Carless Manual of Surgery) యొక్క పూర్వముద్రణలలో ఇటలీ, ఫ్రెంచ్ మరియు ఇతర దేశములలో ప్రయోగించబడిన నాసానుసంధాన పద్ధతులు వర్ణించబడి యుండెను. నవీన ముద్రిత ప్రతిలో కేవలము భారతీయ పద్ధతియే.

వర్ణించబడినది. Many methods of Rhinoplasty have been devised, but only one will be described.

The so called Indian method employed for the construction of the nose a flap of the skin from the forehead, and is, for most cases, the method of choice.

The flap is more or less pyriform, and has its pedicle based on supraorbital vessels. Occasionally the pedicle is so arranged as to contain the superficial temporal vessels,. The construction of the nose calls for the supply of lining and framework in addition to covering skin. If skin is not available in this region, hinged flaps may be obtained from the skin of the cheeks bordering on the lateral margins of the defect, (Rose and Carless Surgery 1947)

ఆ విధముగా ప్రసిద్ధినిపొందిన భారతీయ (శస్త్ర చికిత్సా) పద్ధతి ననుసరించియే నేడు నాసికాపునర్‌నిర్మాణము జరుగుచున్నది. చాలమంది రోగులకు నుదుటి భాగమునుండి వదులుగా నున్న చర్మముయొక్క ముక్కను తీసికొని నాసికను సరిచేయుచున్నారు. ఆ నొసటిభాగపు చర్మమే కొద్దియో గొప్పయో Pyriform ఆకారము మరియు కనుగుంటలపై చర్మపు రక్తనాళములతో కలుపబడి యుండును. అరుదుగా ఈ రక్తనాళపు అతుకులు కణతలకు చెందిన రక్త నాళములతో కలువబడియుండును. నాసికా నిర్మాణము కేవలము పై ఆకారనిర్మాణమునకే కాక లోని రక్తనాళాదుల ధామ నిర్మాణమునకు గూడా అనుగుణమైనదిగా నుండవలెను. ఒకవేళ నుదుటి భాగములో అట్టి (వ్రేలాడు, కదలుచున్న) చర్మము లభించకున్నఎడల చెంపలలోని

అతుకవలసిన భాగపు (ప్రక్కలనుండి తీసికొనవలయును) (రోస్ అండ్ కారలేస్ సర్జరీ - 1942)

చర్మముయొక్క సంధానమున సఫలత లభించిన తదుపరి చర్మమువలె ఎముకలు స్నాయువులు మరియు ఇతర అవయవముల సంధానము ఊహించబడినది.

భాస్కరగోవిందఘాణేకర రచిత **ఆయుర్వేద రహస్య దీపిక-ద్వితీయావృత్తి విక్రమసంవత్సరము 2009 సుశ్రుత సూత్రస్థానము పుట 133**

మేధావులైన పాఠకు లిచట గ్రహించవలసిన వేరొకవిషయము కూడ కలదు. సంస్కృతభాషలో నాసికకు నస్, నసా, నాసా, నాసికా, నస్యా మున్నగు నామములు గలవు. నస్ శబ్దమే అంగ్లములో నోస్ (Nose) గా మారినది. రినోప్లాస్టిక్ శబ్దమునందలి **నో శబ్దము నస్ శబ్దమే.** దీనితో ఆంగ్ల భాష సంస్కృతభాష శబ్దములపైననే ఆధారపడి యున్నదని, సంస్కృత భాషయందలి విజ్ఞానము అంగ్లభాషయందలి విజ్ఞానమునకు మూలము. ఆధారమనియు తెలియుచున్నది.

భాస్కర గోవింద ఘాణేకర్ అనబడు ప్రసిద్ధ ఆయుర్వేదజ్ఞుడు మొదట ఆధునిక విద్యాపద్ధతి ననుసరించి చికిత్సా విజ్ఞానము M.B.B.S. చదివెను. తదుపరి ఆయన సుశ్రుత సంహిత (ఆయుర్వేదము) చదివెను. ఆయన దానిలో ప్రతిపాదించబడిన విశాల విజ్ఞానమును చదివి ఆశ్చర్యాన్వితుడై తన జీవితమును సుశ్రుత సంహితకై సమర్పించెను. దానికై ఆయన తన (దాదాపు) తొంభై సంవత్సరముల జీవితమును ధారపోసెను. ఆయన ఆయుర్వేదము ననుసరించి అనేక ప్రామాణిక గ్రంథములను రచించెను. అందులో సుశ్రుత సంహితయొక్క వ్యాఖ్యానము పేర్కొనదగినది. దాని భూమికయం దాయన

కాయబాలగ్రహోర్ధ్వే చ జరాదంష్ట్ర విషే తథా ।

యదన్యత్ర తదిహాస్తి శల్యం చాస్య న క్వచిత్ ॥ అని పేర్కొనెను.

అర్థము : కాయచికిత్స, బాలచికిత్స, క్రిమి చికిత్స, ఊర్ధ్వాంగచికిత్స, దంష్ట్రలతో కాటువేయుట వలన కలుగు రోగములచికిత్స, విషద్రవ్యములతో చేయుబడు చికిత్సల గూర్చి ఈనాటి వికసిత ప్రపంచమున గల చికిత్స సుశ్రుతములో గలదు. కాని సుశ్రుతములో పేర్కొనబడిన చికిత్స ప్రపంచములో నెచటను లేదని ఉచ్చస్వరముతో ఉద్ఘోషించెను. దీనిని ఎవరు కాదనగలరు ?

మాక్డోనల్ మహాశయుడు కృత్రిమముగ ముక్కును నిర్మించు విజ్ఞానము భారతదేశమునుండియే ఇతర దేశములకు వ్యాపించినట్లు తెలిపెను. చూడుడు

"In modern days Europe surgery has borrowed the operation of artificial noses from India where Englishmen became acquainted with the art in the last Century." (A History of Sanskrit Literature, Page 362

గత శతాబ్దములో (నేటికి దాదాపు రెండువందల సంవత్సరముల క్రితము) ఆంగ్లేయులు భారతదేశవాసులనుండి ముక్కుకు శస్త్రచికిత్స చేయుటను, కృత్రిమ ముక్కునమర్చు విద్యను నేర్చుకొనిరి.

భారతీయ శ్రచికిత్సా శాస్త్రమును అందు ప్రయోగింపబడు పరికరములను ప్రశంసిస్తూ డా. శ్రీమతి మైనింగ్ ఇట్లు వ్రాసెను.

The Surgical Instruments of the Hindus were sufficiently sharp, indeed as to be capable of dividing a hair longitudinally"

(Ancient and Mediaval India, Vol. II, Page 364)

భావము - భారతీయులు వాడు శస్త్ర చికిత్సాపరికరములు వాస్తవముగా వెంట్రుకను గూడ నిలువుగా చీల్చగలుగునంతటి సూక్ష్మమైనవి, పదునుగలవి యై యుండెను.

రెవరెండ్ పీటర్ పార్సిబల్ అభిప్రాయముగూడ ఇటువంటిదే వారి( భారతీయ ఆర్యుల) గ్రంథములలో 127రకరముల శస్త్రచికిత్సా పరికరముల వర్ణన గలదు. లాంగ్యడ్ అఫ్ ది వేదా, పుట 132)

ఎల్ఫిన్‌స్టన్ మహాశయుడు **హిస్టరీ ఆఫ్ ఇండియా లో ఈ** విధముగా వ్రాసినాడు. **భారతీయుల శల్య - శాస్త్రము వారి ఔషధములవలెనే అద్భుతమైనది.**

డా. వెబర్ మహోదయుని అభిప్రాయము గూడ చదువదగినది. మననము చేయదగినది.

"In surgery too, the Indians seem to have attained a special proficiency and in this department European surgeons might perhaps even at the present, still learn something from them as indeed they have already borrowed from the operation of rhinoplastry"

శల్య (శస్త్రచికిత్సా) శాస్త్రములోను భారతీయులు విశిష్ట యోగ్యతను సంపాదించి యుండిరని తెలియుచున్నది. ఈ విభాగములో యూరపుదేశ వైద్యులు ఎప్పటివలె ఇప్పటికిని భారతీయులనుండి శిక్షణ పొందవచ్చును. ఏలయన వారు ముక్కుకు చేయబడు శస్త్రక్రియ భారతీయులనుండియే నేర్చుకొనిరి.

పై ప్రమాణాలను బట్టి అతి సునిశితమైన శస్త్రచికిత్సా పరికరాలలో కూడా మనదేశమే అగ్రగామి అని చెప్పవచ్చును. సుశ్రుత సూత్రస్థానం సప్తమాధ్యాయంలో అనేకానేక శస్త్రచికిత్సా పరికరాల

వర్ణన కనబడుతుంది. అందులో కొన్ని యింకా ఆధునికులు కనిపెట్టలేదేమో అనిపిస్తుంది.

ఇట్టి ప్రమాణాలు ఎన్నోగలవు. తెలిసికోగోరువారు డాక్టర్ భాస్కర్ గోవింద ఘాణేకర్ బి.యస్.సి., యమ్.బి.బి.యస్. గారు వ్యాఖ్యానించిన సుశ్రుత సంహిత చూడగోరుచున్నాము. లభించు స్థలము : మోతీలాల్ బనారసీదాస్, బంగళారోడ్డు, ఢిల్లీ - 7.

పై ప్రమాణములను బట్టి నేటికీ మనమధ్య నిలిచి ఉన్న అశ్వినీదేవతలు చరక సుశ్రుతాలు. అందు ప్రవీణులైన వైద్య ప్రవరులు కూడా అశ్వినీదేవతలే ఏలనన, శ్రీ మహేశ్ యోగిగారి విశేష కృషివలన మన ఆయుర్వేదం విదేశాలలో విరివిగా వ్యాపిస్తున్నది. ఎందరో ఆయుర్వేద వైద్యులు విదేశాలలో గుర్తింపు పొందుతున్నారు. భారతీయ వ్యాధినిదాన పద్ధతిని (Diagnosis) చూసి ఆశ్చర్య పోతున్నారు. ఖరీదైన ఏ వైద్యపరీక్షలు అక్కరలేకనే కేవలం నాడిచూసి రోగనిర్ధారణ చేయగల మన డా. సత్యదేవ్ వాశిష్ట డా. బృహస్పతిదేవ్ త్రిగుణ గార్ల ప్రతిభచూసి విస్తుపోతున్నారు. క్రిమిసంహారక (Antibi-otics) మందుల అవసరం లేకుండానే భారతీయ మూలికలు క్రిమిజన్యమైన అన్ని రకాల వ్యాధులను పోగొట్టగలుగుటలోని రహస్యమేమో వారికి అంతుబట్టుట లేదు. భారతీయ ఆయుర్వేదాన్ని అత్యాధునిక విజ్ఞానంతో సరిపోలుస్తూ వివరిస్తున్న డా॥ దీపక్ చోప్రా యమ్.డి. వంటి వైద్యుల ఉపన్యాసాలను వేల రూపాయలు (50, 60 డాలర్లవరకు) చెల్లించి ఆసక్తితో వింటున్నారు.

ఇక శస్త్ర చికిత్స విషయంలోను ఆయుర్వేదీయులు ప్రపంచ గుర్తింపును పొందినవారున్నారు. ఆంగ్లేయులు రాకపూర్వం మన

దేశంలో శల్య, శాలాక్య చికిత్స (Surgery) ఎంతో వికసితరూపంలో ఉండేది. అందుకు మన ప్రాచీన చరిత్రయే ఆధారం. మహాభారత యుద్ధానంతరం కూడా మన దేశంలో యుద్ధాలు, దండయాత్రలు జరిగాయి. అప్పుడు యుద్ధంలో క్షతగాత్రులైన వీరులు, సైనికులు అప్పటి శస్త్రచికిత్స ద్వారా మరునాటికే కోలుకొని యుద్ధాలు చేసిన సంఘటనలు వేలకువేలు ఉన్నాయి. అట్టి అద్భుత శస్త్రచికిత్స ఆంగ్లేయుల కాలంలో అంతరించి పోయింది. ఎన్నో శస్త్ర చికత్సాగ్రంథాలు విద్వేషాగ్నికి ఆహుతియై పోయాయి. ఎక్కడనో మిగిలిపోయిన ఒకటి రెండు గ్రంథాలే నేడు ఆధునికులకు కూడ మార్గదర్శనం చేస్తున్నాయి. వారు చరక, సుశ్రుతాది గ్రంథాలనుండి ప్రేరణను పొందుతూ, పరిశోధనలు సాగిస్తూ ముందుకు సాగిపోతున్నారు. కాని, మన ఆయుర్వేద వైద్యులలో పరిశోధనా ప్రవృత్తి నామమాత్రంగానే ఉంది. అయినా కొందరు చేసిన పరిశోధనలు ఒక ఆశాదీపంగా మిగిలి ఉన్నాయి.

అట్టివారిలో ఒకరైన కీ.శే. డా. కె.యన్. ఉడూపా A.M.S. - B.H.U. గారు ఒక ప్రసిద్ధిచెందిన ఆయుర్వేద శస్త్ర చికిత్సకులు. వారు తమ ప్రతిభావిశేషంతో అల్లోపతి శస్త్ర చికిత్సకులతో సమానంగా శస్త్ర చికిత్సలు చేస్తూ ఉండేవారు. తదుపరి వారు ఒక సవాలుగా తీసుకొని విదేశాలకు వెళ్ళి యం. యస్. పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై వచ్చారు. అంతేగాక ఆంగ్లేయులు వారిని ఆనాటి ప్రపంచ శస్త్రచికిత్సకులలో ఒకరినిగా గుర్తించి F.R.C.S. (Fellow of Royal Council of Surgeons) అనే ఉపాధికూడా యిచ్చారు. వీరు కొంతకాలం హిందూ విశ్వవిద్యాలయాంతర్గత ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ...

మెడికల్ సైన్సెస్‌లో ప్రిన్సిపాల్‌గా పనిచేసారు. అట్లే, మహా మహోపాధ్యాయ కవిరాజు డా॥ గణనాథ్ సేన్ సరస్వతిగారు ముందు అల్లోపతి వైద్యులై యుండియు తదుపరి ఆయుర్వేద భక్తులై ఎనలేని సేవలు చేసారు. ఆనాడు క్రొత్తగా ఆయుర్వేద కళాశాలలు తెరచినపుడు వైద్యవిద్యార్థుల కొరకు సుశ్రుత శాస్త్ర ఆధారంగా సంస్కృతంలో **ప్రత్యక్ష శరీరమ్** అనే పేరుతో ఒక శరీర నిర్మాణ శాస్త్రాన్ని (Anotomyని) మరియు శరీర ధర్మ శాస్త్రాన్ని (Physiologyని) రచించారు. తదుపరి దానిని హిందీలో కూడా వ్రాసారు. అట్లే డా॥ ముకుంద స్వరూప్, డా॥ విద్యాసాగర్ గార్లు **ప్రత్యక్ష శవచ్ఛేద్** అనే పేరుతో సంస్కృతంలో శవచ్ఛేదన చేసి అందలి అవయవాలను ప్రత్యక్షంగా చూసి గ్రహించే (Practical) శాస్త్రాన్ని రచించారు.

అదే మార్గంలో మరికొందరి రచనలుకూడా ఉన్నాయి. వాటిలో వారాణసి ఆయుర్వేద కళాశాలలో ఆయుర్వేద మౌలిక సిద్ధాంతాలను మరియు శరీర నిర్మాణ శాస్త్రాన్ని బోధించిన కీ.శే. డా॥ (పం) దామోదర శర్మ గౌడ్ A.M.S., గారు సంస్కృతంలో రచించిన **అభినవ శరీరమ్** అనే గ్రంథం ప్రసిద్ధమైనది. నేటికీ ఆయుర్వేద శస్త్ర చికిత్స విద్యార్థులకు ఎంతగానో ఉపయోగపడుతున్నది. కాని, దాని రెండవ భాగము రచించే అవకాశం లేకుండానే వారు దివంగతులయ్యారు. అది నేటికీ మరెవరిచేతను పూర్తిచేయబడలేదు. తదుపరి ఆచార్య ప్రియవ్రత శర్మ మరియు శ్రద్ధేయ డా॥ రణజిత్‌రాయ్ దేశాయ్ గార్లు సచిత్ర శరీర క్రియావిజ్ఞాన్ అనే పేరుతో రెండు ఆధునిక, ప్రాచీన శస్త్ర చికిత్సా గ్రంథాలు వ్రాసారు. అట్లే డా॥ భాస్కర గోవింద ఘాణేకర్ గారి సుశ్రుతము, డా॥ జీవరాజ్ మెహతా గార్ల చరక, సుశ్రుత వ్యాఖ్యాన గ్రంథాలు నేటికీ ఆయుర్వేద పరిశోధనా విద్యార్థులకు (రీసెర్చ్ స్కాలర్స్ లకు) అద్భుతమైన మార్గదర్శనం చేస్తున్నాయి.

## ఆయుర్వేద 'సూపర్ స్పెషాలిటీ' ఆసుపత్రులు

పై శీర్షిక మీకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నదా? ఈ సూపర్ స్పెషాలిటీస్ ఇప్పటివి కావు సుమా! చాలా ప్రాచీనమైనవి. శంకర, రామానుజాచార్యులు రాక పూర్వమే, బౌద్ధమతం మన దేశంలో ప్రచలితమైయున్న కాలంలోనే ఉండేవి. ఈనాడు దినపత్రిక (30-1-1992 పదవ పుట)లో ప్రచురించబడిన ఈ క్రింది పరిశోధనా వ్యాసం (Ph.D. Thesis) చదివితే మీకే అవగతమవుతుంది.

**3వేల ఏళ్ళనాడే 'సూపర్ స్పెషాలిటీ' ఆస్పత్రులు**

హైదరాబాద్. జనవరి 29 (న్యూస్‌టుడే) పచ్చని చెట్ల మధ్య విశ్రాంతి మందిరంలాంటి అందమయిన భవనం... తుడిచిన అద్దాల్లాంటి విశాలమయిన గదులు...ఆహ్లాదకరమయిన గాలి, వెచ్చని ఎండను తగుపాళ్లలో మాత్రమే లోనికి అనుమతించే వాస్తు నిర్మాణ చాతుర్యం! ఆస్పత్రి ఆవరణలోని ప్రత్యేకమైన ఇళ్లలో నివసిస్తూ పగలూ రాత్రి రోగులకు అందుబాటులో వుండే వైద్యులు, శస్త్రచికిత్స నిపుణుడు, దీర్ఘవ్యాధి పీడితులు, పిల్లలు, ప్రసూతికోసం వచ్చే స్త్రీలకోసమే కాకుండా, ప్రమాదాలకు గురై ప్రాణాపాయకర స్థితిలో తరలించేవారికోసం విడిగా మరో విభాగం ఏమిటి? ఇవన్నీ ప్రధాన నగరాల లోని సూపర్ స్పెషాలిటీ అస్పత్రుల్లో వుండేవేగదా అనకండి! ఈ ఏర్పాట్లన్నీ ఈనాటి అస్పత్రికి సంబంధించినవి కాదు. దాదాపు మూడువేల సంవత్సరాల క్రితమే భారతదేశంలో వందల సంఖ్యలో ఉండిన ఆస్పత్రుల సాధారణ చిత్రం ఇది.

పశ్చిమ దేశాల వారికి ఆస్పత్రి భావన తెలిసేనాటికి పదిహేడు వందల సంవత్సరాల పూర్వమే భారతీయ వైద్యనిపుణులు

రోగ్యశాల - చికిత్సశాల - పుణ్యశాల పేరిట వ్యవహరిస్తూ వీటిని ర్వహించారు. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయానికి చెందిన న్స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌లో బేసిక్ ప్రిన్సిపుల్ విభాగం ాచార్యుడు ప్రొఫెసర్ జ్యోతిర్‌మిత్ర ఒక పరిశోధనా వ్యాసంలో ఈ షయం వెల్లడించారు.

ప్రాచీన భారతదేశంలోని ఆస్పత్రులు, వాటి నిర్వహణకు ంబంధించిన ఆసక్తికరమయిన అనేక అంశాలను ప్రొఫెసర్ ్యోతిర్‌మిత్ర తన వ్యాసంలో వివరించారు.

ప్రాచీన భారత ఉపఖండంలో మొదటి చికిత్సశాల క్రీస్తు పూర్వం వెయ్యి సంవత్సరాలనాడు ఏర్పాటయిందని, వేదకాలంనాటి మంత్రద్రష్ట ఋషులు రోగపీడితులకు శాశ్వత నివారణ కల్పించేందుకు ానుభూతితో కృషిచేసేవారని ప్రొఫెసర్ జ్యోతిర్‌మిత్ర తెలిపారు. అన్ని ానాలలోకెల్లా ఆరోగ్యదానం అత్యుత్తమమైందని ప్రాచీనకాల భారతీయ సంపన్నులు, పాలకులు భావించేవారు. బుద్ధుడికాలం (క్రీ.పూ. 624-544) నాటికి ప్రతిబౌద్ధ విహారానికి అనుబంధంగా బౌద్ధ భిక్షువుల చికిత్స అవసరాల కోసం ఆరోగ్యశాలలను ఏర్పాటుచేశారు. ఆనాటి బౌద్ధ గ్రంథాలయిన వినయ పీఠికలో ఆరోగ్యశాలలను గలనశాలలుగా వైద్యుడిని భిషక్కు రోగిని గలనో, రోగివెంటవుండే సంరక్షకుడిని (అటెండెంట్) గలను పథక్రగా పేర్కొన్నారు. ఆనాటి ప్రముఖ వైద్య నిపుణుడు మగధ చక్రవర్తి అజాతశత్రువు గౌతమబుద్ధుని వైద్యుడు అయిన జీవకుడి అస్పత్రి 'జీవక మరావనగా పేరుపొందింది. బీహర్‌లోని రాజ్‌గిరిలో పురావస్తు నిపుణులు జరిపిన తవ్వకాల్లో ఇది బయటపడింది.

ఆచార్య చాణక్యుడి (క్రీ.పూ. 320) **అర్థశాస్త్రం** చంద్రగుప్తుడి కాలంనాటి (క్రీ.పూ. 324-300) మౌర్య సామ్రాజ్యంలో ఆస్పత్రుల వ్యవస్థపై అనేక వివరాలు తెలుపుతోంది. ఆనాటి చికిత్సశాలల్లో జనరల్ వార్డును **వ్యాధి సమస్త** అని. ప్రసూతి వార్డును **గర్భ సమస్త** అని. ఎమర్జన్సీ వార్డును **ప్రత్యఖాయత సమస్త** అని పేర్కొనేవారు. అనారోగ్యకరమయిన, ప్రాణాపాయ (విష) కరమైన పదార్థాలు తిని చికిత్సాలయానికి వచ్చే రోగులను (మెడికో లీగల్ కేసులు) గురించి చికిత్సకుడు ప్రభుత్వానికి తెలియజేసితీరాలి. లేకుంటే శిక్షకు పాత్రులవుతారని అనాడు చట్టం వుండేది.

యుద్ధంలో గాయపడ్డ సైనికులకు చికిత్స చేయటానికి యుద్ధ భూమికి సమీపంలో ప్రత్యేకంగా గుడారాలు వేసి తాత్కాలిక చికిత్సాలయాలు ఏర్పాటు చేసేవారు. **రణక్షేత్ర వైద్యాన్ని** ఆనాడు బాగా అభివృద్ధి చేశారు. గాయాలు, వ్యాధులవల్ల జనించే నొప్పులను తగ్గించేందుకు **వేదనా నివారితికార** (అనాల్జిక్)ను విస్తారంగా వాడేవారు. చంద్రగుప్త మౌర్యునికాలంలో గ్రీకు రాయబారి మెగస్తనీస్ రచనలు ఆనాటి భారత దేశంలో ఆస్పత్రుల పరిస్థితిపై అనేక ఆసక్తికరమైన వివరాలు తెలిపాయి. ప్రపంచంలో మొట్టమొదటిసారిగా 'పోస్టమార్టం' ఆనాడే ప్రారంభించారు. ఇందుకోసం ప్రత్యేకంగా వైద్యనిపుణులను నియమించేవారు. పశ్చిమదేశాల్లో పదహారో శతాబ్దంలోగానీ ఈ పద్ధతి మొదలుకాలేదు దీనికి సంబంధించి అశోకుడి **గిరినార్ శిలాశాసనం** (క్రీ.పూ. 272-232) లో మరింత సమాచారం లభించింది. జైనుల ధార్మిక నియమావళి **జనతంగ ధర్మ కథాసూత** (క్రీ.పూ. 599 - 527) పూర్తిహంగులుగల ఆస్పత్రులను గురించి వివరిస్తుంది

తెగిచ్చశాల లుగా నీటిని పేర్కొనేవారు. ఆనాటి సంపన్న వ్యాపారవేత్త నందన్ మరనికర రాజ్‌గిరి నగరానికి పశ్చిమదిశగా వుండే వనం మధ్యలో ఒక బ్రహ్మాండమయిన ఆస్పత్రిని నిర్మించాడు. వంద స్తంభాలపైన నిర్మించిన ఈ చికిత్సాలయ భవనం గోడలపై అనేక చిత్తర్వులు కూడా వుండే'వని అనేకమంది వైద్య నిపుణులు, పారా మెడికల్ సిబ్బంది, వైద్య విద్యార్థులు, ఇతరులు వాటిల్లో పనిచేసేవారని పరిశోధనల్లో వెల్లడయ్యింది. ఈ ఆస్పత్రిలో వుండే సంపన్నులనుంచి రుసుము వసూలుచేసి నివాస, భోజనవసతి కల్పించినా పేదలకు మాత్రం ఉచితంగా మందులు, పోషకాహారం, ఇతర సేవలందజేసేవారు. దక్షిణభారతానికి చెందిన పరాక్రమబాహు (క్రీ.శ. 1164) అనేక విభాగాలతో ఆస్పత్రిని ఏర్పాటుచేయటమే కాకుండా ఆరోగ్యకరమయిన ఆహారం, మందులు అందించే వసతి కల్పించాడు. ఇందుకోసం ఆస్పత్రి భవనానికి అనుబంధంగా ప్రత్యేక గోదాములు, వైద్యులు, ఇతర వైద్యసిబ్బందికోసం నివాస గృహాలు నిర్మించాడు. తన పరివారంతో కలిసి నెలకు కనీసం నాలుగుసార్లు ఆస్పత్రిని సందర్శించి రోగులను పరామర్శించేవాడు. ఆస్పత్రి నిర్వహణను మెరుగుపరచేందుకు సంబంధించి అక్కడి కక్కడే ఆదేశాలు జారీచేసేవాడు. వీర రాజేంద్రచోళుడు (క్రీ.శ. 1067) విద్యాలయాలకుతోడు ఆస్పత్రుల నిర్వహణకోసం తన ఆదాయంలోంచి ప్రత్యేకంగా నిధులు ఏర్పాటు చేశాడు. కాకతీయ రుద్రమదేవి తన ఆదాయంలోంచి మూడోవంతును ప్రసూతి, ఆరోగ్య సేవలకోసం వినియోగించేదని, మల్కాపూర్ శిలాశాసనం (క్రీ.శ. 1262) లో ఇందుకు ఆధారాలు లభించాయని ప్రొఫెసర్ జ్యోతిర్‌మిత్ర

తెలిపారు. ప్రాచీన భారతదేశ ఆస్పత్రుల్లోని సర్జికల్ వార్డులను పరవిత్ర గృహ చికిత్సా గదిని సమెహూర్ధాన గృహ మాసెజ్ రూమ్‌ను స్నేహన గృహ సానిటోరియంను ఆరోగ్యవిహార్ రికవరీ రూమ్‌ను సమసర్జన గృహ మానసిక రోగాల ఆస్పత్రిని తమో గృహ అనేవారని ఆయన వివరించారు.

ఆనాడు భారతదేశంలో తప్పించి తక్కిన ప్రపంచదేశాల్లో ఎక్కడా ఆస్పత్రులు వుండేవికావని బ్రిటిష్ ప్రముఖ చరిత్రకారుడు విన్‌సెంట్ స్మిత్ పేర్కొన్నాడు.

ఇకమనం చారిత్రక అశ్వనీదేవతల విషయం యింతటితో ముగించి, వేదాలలో అశ్వినీదేవతలెవరో తెలిసికొందాము.

రెండవ చంద్రగుప్తుని రాజ్యకాలము(విక్రమ సం॥ 372-470)లో చైనా దేశస్థుడగు బౌద్ధయాత్రికుడు ఫాహియాన్ (విక్రమ సం॥ 462-468) లో వ్రాసిన వ్రాతల బట్టి ఇతని రాజ్యము రామ రాజ్యము రాజ్య విస్తీర్ణము చేసి విక్రమాదిత్య బిరుదు పొంది విజయస్థంబమును డిల్లీలో ఉక్కు స్తంభమున వ్రాయించెను. అది ఇప్పటివరకు ఉన్నది. పాటలీపుత్రమందు కల ధర్మవైద్య శాలలను వర్ణించెను. ఇట్టి వైద్యశాలలు నాడు భారత దేశములో తప్ప ప్రపంచమున ఎక్కడ లేకుండెను. విక్రమ సం॥ 10వ శతాబ్దములో ఐరోపాల్ వైద్యశాలలు పుట్టెను. ఈ కాలములో వేల కొద్ది బౌద్ధ సంన్యాసులు గల విహారములు వైద్యశాలలు దేశము పొడుగునా ఉండెను. ఈ ఫాహియాన్ భారతీయులతో కూడి యొక వర్తక నౌక నెక్కి పది దినములకు జావా చేరినట్లు అచ్చట బ్రాహ్మణులు అనేకులుండినట్లు భారతీయ వైదిక ధర్మము మిక్కిలి అభివృద్ధిలో నున్నట్లు వ్రాసినాడు.

- డా॥ ఆచంట లక్ష్మీపతి

(భారతీయ విజ్ఞానము, మొదటి సంపుటము)

# వేదాలలో అశ్వినీ దేవతలు

పూర్వ ప్రకరణంలో ఆయుర్వేద అవిర్భావం లో చెప్పుకొన్నట్లు వేదాలు సృష్టికి ఆదిలోనే విశ్వనిర్మాత పరమేశ్వరునిచే నీయబడిన విజ్ఞాన గ్రంథాలు. అందు మానవుల కవసరమగు భౌతిక, సామాజిక, ఆధ్యాత్మిక విజ్ఞానమంతయు సూత్రాల (మంత్రాల) రూపంలో నిక్షిప్తమై ఉంది. అట్టి నాలుగు వేదాలలోను అశ్వినౌ పదము వేల సందర్భాలలో ప్రయోగింపబడింది. ఆ పదము యొక్క అర్థంకూడా చాలా విశాలంగాను, విచిత్రంగాను ఉంది.

వ్యాకరణ విద్వాంసుల కథనం ప్రకారం అశ్వినౌ పదము ద్వివచనంలో ఉంది. దాని ఏకవచన రూపం అశ్వీ అది అశూఙ్ వ్యాప్తౌ అను ధాతువుతో (సంస్కృత మూల శబ్దముతో) రూపొందుతుంది. **అశూఙ్ + విన్ = అశ్విన్, అశ్వీ** అవుతుంది. విచిత్రమేమంటే - ఈ పదము వేద శాస్త్రాలన్నిటిలోను ద్వివచన రూపంలోనే అశ్వినౌ అని ప్రయోగింపబడింది. వేదాలలో కొన్నిచోట్ల సుపాం సులుక్ అనే వ్యాకరణ సూత్రంతో చివరి నౌ అక్షరము నాగా మారి అశ్వినా అనికూడా ప్రయోగింపబడింది. ధాతువును బట్టి దీని అర్థం వ్యాపించి ఉండే రెండు శక్తులు. ఈ రెండు శక్తులు ఎప్పుడూ అన్యోన్య సంబంధంకలిగి జంటగా కలిసి ఉంటాయి. అందుచే వేదాలలో అంతట ఈ పదము ద్వివచనరూపంలో ప్రయోగింపబడింది.

మరొక వ్యాకరణాచార్యుడైన ఔర్ణనాభుని కథనం ప్రకారం - అశ్వ + ఇన్ = అశ్వ్ + ఇన్ = అశ్విన్ →అశ్వీ→ద్వివచనంలో అశ్వినౌ అవుతుంది. ఈ ప్రత్యయము మత్వర్థ మగుటవలన మత్వర్థే

ప్రశంసాయామ్' అని చెప్పబడుటచే - ప్రశస్తా అశ్వా, ఇంద్రియాణి, వేగోవా యయోః, తౌ అశ్వినౌ అనగా ఎవనికి ఉత్తమమైన రెండు అశ్వములు, ఇంద్రియములు లేదా వేగము కలవో అతడు అశ్వీ అనబడును.

అయితే, వేదాలలో నిగూఢమైయున్న అర్థాన్ని తెలుసుకోవడానికి పై అర్థాలతోబాటు మరెంతో విశాలంగా అవగాహన చేసుకోవలసి ఉంటుంది. ఆ వ్యాపకగుణము, వేగవంతము, ప్రశస్తమునైన జంట శక్తులు ఏవేవి ? ఎవరెవరిని లేదా వేటిని అశ్వినౌ అనవచ్చును. అని లోతుగా ఆలోచించవలసి ఉంటుంది. అందుకు యాస్కమహర్షికృత నిరుక్తము మనకు ఎంతగానో మార్గదర్శనం చేస్తుంది. అందుచేతనే అది వేదార్థాన్ని తెలుసుకోవడానికి అవసరమైన షడంగాలలోఒకటిగా నిర్దేశించబడింది. శిక్షా, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిష్యము అనే ఆరు శాస్త్రాలను షడంగములు అంటారు. వీటిని గురుముఖతః చక్కగా అధ్యయనం చేస్తేనే వేదార్థం చక్కగా విశదమౌతుంది. వీటిలో వ్యాకరణనిరుక్తాలు అత్యావశ్యకమైనవి. అట్టి నిరుక్తము అశ్వనీ దేవతల గురించి ఏ వివరణ యిస్తుందో సంక్షిప్తంగా' తెలిసికొందాము.



# యాస్క మహర్షి దృష్టిలో అశ్వనీ దేవతలు

పూర్వం ఎందరో ఋషులు వ్రాసిన వివిధ నిరుక్త శాస్త్రాలు ఉండేవి. ప్రస్తుతము యాస్కమహర్షికృత నిరుక్తముమాత్రమే లభించుచున్నది. దానిపైననే వివిధ వ్యాఖ్యలున్నవి. వాటిలో దుర్గాచార్యకృత వ్యాఖ్య నిరుక్తవృత్తిని మత్ గురువర్యులు కీ.శే. పూజ్య పం. గోపదేవ శాస్త్రిగారు తెలుగులో అనువదించి తెలుగువారికి మహోపకారం చేసారు. అందలి **అశ్వినౌ** పద వివరణలో ముఖ్యమైన భాగాన్ని యిచట యథాతథముగా పొందుపరచుచున్నాను. పూర్తి సంస్కృత వ్యాఖ్యా సహిత అనువాదమును చూడగోరువారు **ఆ** బృహద్గ్రంథమును చూడగోరుచున్నాను. (ప్రాప్తి స్థానము : అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు, 3-3-738, మాశెట్టి బిల్డింగ్, కంచరి బజార్, సికింద్రాబాద్ - 500 003.)

## నిరుక్తము ద్వాదశాధ్యాయము

### ప్రథమ పాదము

అథాతో ద్యుస్థానా దేవతాః. తాసామశ్వినౌ ప్రథమాగామినౌ భవతః.

**అశ్వినౌ - (1)**

అశ్వినౌ యద్ వ్యశ్నువాతే సర్వం రసేనాన్యో జ్యోతిషా z న్యః.
అశ్వైరశ్వినావిత్యౌర్ణవాభః.
తత్ కావశ్వినౌ ? ద్యావాపృథివ్యావిత్యేకే. అహోరాత్రావిత్యేకే.
సూర్యా చంద్రామసావిత్యేకే. రాజానౌ పుణ్యకృతావిత్యైతి
హాసికాః. తయోః కాల ఊర్ధ్వమర్ధరాత్రాత్ ప్రకాశీభావ

స్యానువిష్టంభమ్. అనుత్తమో భాగో హి మధ్యమః, జ్యోతి
ర్భాగ ఆదిత్యః. తయోరేషా భవతి -
వసాతిషు స్మ చరథో z సితౌ పేత్వావివ. కదేదమశ్వినా
యువమభి దేవాం అగచ్ఛతమ్" ఇతి సా నిగదవ్యాఖ్యాతా.
తయోః సమానకాలయోః సమానకర్మణో సంసుత ప్రాయ యోః
అసంస్తవేనైషోzర్ధర్చో భవతి, వాసాత్యో అన్య
ఉచ్యత ఉషః పుత్రః తవాన్య ఇతి. తయోరేషా అపరా భవతి -
ఇహేహ జాతా సమవావశీతామరేపసా తన్వా నామభిః
స్వైః జిష్ణుర్వామన్యః సుమఖస్య సూరిర్దివో అన్యః సుభగః
పుత్ర ఊహే (ఋ. 1-181-4)
ఇహ చేహ చ జాతౌ సంస్తూయేతేపా పేనాలి ప్యమానయా
తన్వా నామభిశ్చ స్వైర్జిష్ణుర్వామన్యః సుమహతో బలస్యే
రయితా మధ్యమో దివో అన్యః సుభగః పుత్ర ఊహ్యత ఆదిత్యః.

అర్థము : గత అధ్యాయమున, లింగ, వచనసహిత మధ్యమ స్థానీయ దేవతల వ్యాఖ్యచేయబడినది. ఈ యధ్యాయమున ఇప్పుడు నవమామ్నాయక్రమముతో ద్యుస్థానీయదేవతలనుగూర్చిన వ్యాఖ్యానము చేయుచున్నాము.

ఆ ద్యులోకమున నుండు దేవతలలో మొదట అశ్వినీదేవతలు వత్తురు.

అశ్వినౌ - అశ్వి అని యేల యనబడుచున్నారు ? ఏలయన - ఈ అశ్వినీదేవతలు సర్వమ్ = సమస్తమును, వ్యస్నువాతే = వ్యాపింతురు - కమ్ముకొందురు, రసేన అన్యః = వీరిలోనొకరు రసేన= రసముతో, అన్యః = మఱియొకరు, జ్యోతిషా = జ్యోతిస్సు -

ప్రకాశముతోను అంతటను వ్యాపింతురు. ఈ యిరువురిలో నొకడు మధ్యమస్థానీయుడు. మఱియొకడు ద్యులోకస్థానీయుడు. కాని యిరువురు ఒకటిగా కలిసియుందురు. ఒకరి నుండి మఱియొకరు విడివడరు. అందువలన ఇట ద్యులోకమున నుండు దేవతలలోనే యీ యిరువురివర్ణనము ఒకే స్థలమున చేయబడుచున్నది. **అశూఙ్** వ్యాప్తౌ అనుధాతువునకు **విని** ప్రత్యయముచేర్చుటవలన అశ్వినౌ - శబ్దము సిద్ధమగును. అశ్వినీదేవతలనబడుచున్నారు. ఔర్ణవాభ ఆచార్యుని మతము -

అశ్వైః = అశ్వములుకారణముగా అశ్వినులనబడుచున్నారు. అశ్వశబ్దమునకు మతుబర్థమున ఇని ప్రత్యయముతో అశ్వినిశబ్దము సిద్ధమగును. ఇట్లు అశ్వినౌ - అశ్వవంతౌ = అశ్వములుకలవారు లేక వేగవంతౌ = వేగముకలవారు అని అర్థము.

తత్ కౌ అశ్వినౌ ? అప్పుడు అశ్వినౌ అన నెవరు ? ద్యావా పృథివ్యౌ = ద్యులోకపృథివీలోకములు అశ్వినౌ = అశ్వినులు - ఇతి ఏకే = అని కొందరు ఆచార్యులనుచున్నారు. ఏలయన ద్యులోకము తనజ్యోతి - ప్రకాశముతో నన్నిటిని వ్యాపించియున్నది. పృథివీలోకము అన్నముతో నన్నింటిని వ్యాపించియున్నది. మఱియు నీరెండు లోకములు - వేగవంతములు. కావున ద్యుపృథివీలోకములు అశ్వినులని కొందఱు

మఱికొందరు నైరుక్తులు = నిరుక్తకారులు, అశ్వినౌ - అహోరాత్రములు - దినరాత్రులు అనుచున్నారు. ఏలయన దినము ప్రకాశముతో నన్నిటిని వ్యాపించును. రాత్రి మంచుతో నన్నింటిని కప్పివేయును - వ్యాపించును. కావున దినరాత్రులు అశ్వినులను

చున్నారు. మఱియు నీ దినరాత్రులు వేగముకలవియును.

ఇంకకొందఱు అశ్వినౌ = సూర్యాచంద్రమసౌ = సూర్య చంద్రులు అనుచున్నారు. ఏలయన సూర్యుడు ప్రకాశముతోను, చంద్రుడు రసముతోను సమస్తమును వ్యాపించును, కావున సూర్యచంద్రులు అశ్వినులనబడుచున్నారు. ఈ సూర్యచంద్రులు వేగవంతములుకూడ.

ఐతిహాసికులు - అశ్వినౌ = పుణ్యకృతేరాజానౌ = పుణ్యవంతులైన ఇరువురు రాజు లనుచున్నారు. వీరిరువురు అశ్వవంతులును - తయోః = ఆ యశ్వినులకాలము, అర్ధరాత్రాత్ ఊర్ధ్వమ్ = అర్ధరాత్రమునకు తదుపరి అనుచున్నారు.. ప్రకాశీభావస్య = ప్రకాశీభావమునకు, అనువిష్టంభమ్ = తమః = ప్రకాశౌ = చీకటివెలుగులు రెండును పరస్పరము వ్యాపించుకాలము అశ్వినులకాలము. అనువిష్టంభమనగా - పరస్పర వ్యాప్తి అని యర్థము. అనుత్తమః భాగః హి మధ్యమః = ఇందు అంధకార - భావము మధ్యమదేవత, జ్యోతిర్భాగ ఆదిత్యః = ప్రకాశభాగము ఆదిత్యుడు - సూర్యుడు ఉత్తమస్థానీయదేవత. ఇక నీదేవతలకు సంబంధించిన ఋక్కు.

మంత్రార్థము - అశ్వినా! = ఓ యశ్వినులారా! మీరు ఇరువురు, అసితౌపేత్వా ఇవ = నల్లని మేఘములవలె, వసాతిషుచరథః = రాత్రులందు చరింతురు, యువామ్ = మీరిరువురు, కదా=ఎప్పుడు, ఇదమ్ = మా యీ యజ్ఞకర్మమునందు, దేవాన్ అభ్యగచ్ఛతమ్ = దేవతలను ప్రాప్తించితిరి ? పొందితిరి. తయోః = ఆ సమాన కాలముగల (అర్ధరాత్రికి తదుపరి కాలము) సమానస్సు...

అశ్వినులకు సంబంధించిన భిన్నభిన్న స్తుతిని దెలుపు అర్థఋక్కుకూడ చూడనగును. వాసాత్యో అన్య ఇత్యాది ఋక్కు దాని యర్థము -

హే సూర్య! తవ = నీయొక్క, వాసాత్యః అన్యః ఉచ్యతే = ఒక పుత్రుడు - రాత్రిపుత్రుడు అనబడును. ఉషః పుత్రః అన్యః - రెండవ వాడు ఉషాపుత్రుడనబడును. అనగా - రాత్రి, ప్రకాశము అను నీరెండింటి కలయిక అశ్వినీదేవతలనబడునని భావము. ఆ యశ్వినులకు సంబంధించిన మఱియొక ఋక్కుకలదు. అది అశ్వినులలో ఒక యశ్వి మధ్యముడనియు రెండవయశ్వి ఉత్తముడనియు చెప్పును. ఈ విషయమును బలపఱచు ఋగర్థము చూడుడు.

మంత్రార్థము : హే అశ్వినౌ ! = ఓ యశ్వినులార ! ఇహ ఇహ జాతా = ఇహ = మధ్యమస్థానమున నుత్తమస్థానమున నుత్పన్నులైన మీరిరువురు, అరేపసా తన్వా=పాపముతో లిప్తముకాని స్వరూపముతో, స్వైః నామభిః = మీ స్వనామములతో, సమవావశీతామ్ సంస్తూయేతే = స్తుతిచేయబడుచున్నారు, వామ్ = మీ యిరువురిలో, అన్యః = ఒకరు, జిష్ణుః = నిత్యజయశీలుడు, సుమఖస్య సుఖహతః = అత్యంతబల ప్రేరకుడును అతడు మధ్యమస్థానీయుడు, అన్యః = రెండవవాడు, దివః = ద్యులోకస్థానీయుడు, నుభగః = ధనధాన్యపూర్ణపుత్రుడు, ఊహే = వాయువుచే నడపబడును లేక తన యశ్వములతోనే నడుపబడును. అతడు ఆదిత్యుడు.

భాష్యార్థము : ఇహ ఇహ జాతా = ఇహ చ ఇహ చ జాతౌ = ఇటమధ్యమ స్థానమున, ఇహచ = ఉత్తమస్థానమున, జాతౌ = జన్మించినవారు, సమవావశీతామ్ - సంస్తూయేతే = స్తుతిచేయ

బడుచున్నారు, అరేపసా = పాపేన అలిప్యమానయా = పాపముచే లిప్తముకాని పాపరహిత - తన్వా = స్వరూపముతో, సుమఖస్య = సుమహతః బలస్య = మిక్కిలిగొప్పబలము యొక్క, సూరిః = ఈరయితా = ప్రేరకుడు మధ్యమః = మధ్యమ స్థానీయుడు, ఊహే - ఊహ్యతే = వహింపబడును. ఆదిత్యః = అతడు ఆదిత్యుడు. ఇట్లీమంత్రమున అశ్వినులు ఒకడు మధ్యమస్థానీయుడు మఱియొకడు ఉత్తమ స్థానీయుడునని వర్ణింపబడినది.

ఇట్లే మరికొన్ని మంత్రముల వ్యాఖ్య చేయుబడింది. వివరముగా తెలిసికోగోరువారు పూర్వము తెలిపిన పుస్తకములో చూడవచ్చును.

అయితే నిరుక్తశాస్త్రం మనకు మార్గదర్శనం చేస్తుందేకాని, కేవలం అందు చూపిన అశ్వినీపద అర్థాలే వేదంలో సర్వత్రా వర్తిస్తాయనటానికి వీలులేదు. ప్రకరణానుగుణంగాను, ఆధ్యాత్మిక ఆదిభౌతిక, ఆధిదైవిక అర్థాలలోను వేరువేరు అర్థాలను సూచిస్తాయి. అట్టి సమగ్రదృష్టితో వేదాల వ్యాఖ్యానం - భాష్యం వ్రాయవలసి ఉంటుంది. పై దృష్టికోణంగల భాష్యాలలో మహర్షి దయానందుని భాష్యమే అగ్రగామిగా నుండగలదనుట అతిశయోక్తి కాదు.

మహర్షి దయానందుడు వేదాంగములను పూర్తిగా అధ్యయనం చేసిన వేదాంగకోవిదుడు అంతేగాక ఉపాంగములయిన వైశేషిక, న్యాయ, సాంఖ్య, యోగ, మీమాంసా, వేదాంత దర్శనములను క్షుణ్ణముగా అధ్యయనం చేసిన దర్శనాచార్యుడు. వీటన్నిటెని మించి అతడు ఒక గొప్ప యోగి. మహా తపస్వి. తన తీవ్ర తపోయోగసాధనలతో ఋతంభరా ప్రజ్ఞను బొందిన మహామేధావి. సర్వవ్యాపక సర్వేశ్వరుని అనన్యభక్తుడు. అట్టి జ్ఞానతపోయోగ బలములతో అసంప్రజ్ఞాత

సమాధిలోనికి వెళ్ళి పరమేశ్వరునిద్వారా వేదార్థాన్ని నేరుగా గ్రహించిన గొప్ప ఋషి. అంతటి ఋషులు మాత్రమే వేదార్థాన్ని సరిగా వివరించగలరు. అందుచే వారి భాష్యమే అగ్రగామి, అరవిందయోగి అభిప్రాయంకూడా అదే.

యోగి అరవిందుడు ఒక ప్రసిద్ధ తాత్త్వికుడు ప్రాచ్య పాశ్చాత్య తత్త్వశాస్త్రముల నన్నిటిని అధ్యయనంచేసిన గొప్ప తత్త్వవేత్త. ఇంతేగాక, భారత స్వాతంత్ర్యపోరాటంలో మహోత్సాహంతో పాల్గొన్న దేశభక్తుడు. తదుపరి రాజకీయాలకు దూరంగా మానవజీవన చరమ లక్ష్యమైన మోక్షసాధనలో గడపిన ఉత్తమ యోగి. వారికి వేదాలపైన, భారతీయ సంస్కృతి సభ్యతలపైన శ్రద్ధాభక్తులు మెండు. దానికి కారణము అవి వేదానుకూలములగుటయే. అందుచేతనే వారు నడిపిన ఆంగ్లపత్రికకు **వేదిక్ మేగజైన్** అనే పేరు పెట్టుకున్నారు. అట్టి పత్రికలో (క్రీ.శ. 1915లో) దయానందుని గురించి ఒక వ్యాసం వ్రాస్తూ - **నేటి భారత పునర్వికాసాన్ని భావి ప్రజానీకము తలపోయునపుడు, తత్కర్తలుగా వారికి తోచు మహాపురుషులలో ఒక మహనీయుడు ప్రత్యేకముగా ప్రకాశింపగలడు. అతని శ్రేణి ప్రత్యేకమైనది. అతని కార్యధోరణి అనన్యమైనది.... సంస్కర్తలలో మహోన్నత శిఖరము. (ఎవరెస్టు) వంటి వా** డని కొనియాడుతూ వారిలోని వైశిష్ట్యాన్ని సంక్షిప్తంగా ప్రస్తుతించి చివరగా -

మన కందరకు ముఖ్యముగా ఈ కాలమునకు అవసరమైన శుద్ధ సత్త్వము సుప్రసన్నత , దూరదృష్టి కర్మకౌశలము, ధర్మ వీరత్వము ఈ గుణములు మరల మన యందు ప్రకాశించునట్లు భారతదేశమున దయానందుని తత్త్వము అపరిచ్ఛిన్నముగా నలరారుగాక! ", అను ఆశాభావమును వ్యక్తము చేయుచు ముగించారు.

1916 సంవత్సరంలో అదే పత్రిక (వేదిక్ మేగజైన్)లో దయానందుని వేదార్థ వైశిష్ట్యాన్ని వేనోళ్ళ కొనియాడుతూ మరొక వ్యాసం వ్రాసారు. అందు - **దయానంద స్వామికి వేదము కులపర్వతము** వారి **భావప్రపంచానికి అది పునాది.....** అంటూ ప్రారంభించి ప్రాచ్య పాశ్చాత్య వేద భాష్యాలను సమీక్షించి అందు దయానందుని భాష్య ఔచిత్యాన్ని, ఔన్నత్యాన్ని కొనియాడారు. చివరగా -

వేదార్థ ప్రవచనము (భాష్యము) లందు చరమ సిద్ధాంతము లేవైనను, అందుకు దయానందులు మార్గదర్శి యనుట యథార్థము. వారి మార్గమున సత్యము తెలియగలదు. బహుశతాబ్దములనుండి మరుగునపడియున్న వేదముల సత్యస్వరూపము వారి దృష్టి కగుపడినది. ప్రధాన వస్తువు నాకర్షించినది. దయానందులు జ్ఞానకాసారములకు పైకప్పు తొలగించినవారు. కాలవశమున మూతపడిన (వేదాల) ఆలయాల తలుపులు తెరచిన మహనీయుడు - దేవ దయానందుడు అని కొనియాడుతు పూర్తిచేసారు.

ఇక అశ్వనీదేవతల గురించి మహర్షి దయానందుడు ఏయే అర్థాలు వ్రాసారో తెలిసికొందాము.



# దయానంద మహర్షి దృష్టిలో అశ్వినీ దేవతలు

మహర్షి దయానందుని దృష్టి సువిశాల మైనది. ఆదర్శమైనది. మహోన్నతమైనది. వేదాలలో కేవలం ఆధ్యాత్మిక విద్యలేకాక భౌతిక, సామాజిక జ్ఞాన విజ్ఞానా లున్నాయని నిరూపించిన అద్భుత విజ్ఞాన వేత్త. అన్ని రంగాలలోను పూర్వపు భారతదేశ ఔన్నత్యానికి మూలాధారం వేదములేనని గ్రహించిన అసామాన్య ఇతిహాసవేత్త. భారత అవనతికి కారణము లేవో అన్వేషించి పునర్వికాసానికై అహర్నిశలు తపించిన గొప్ప దేశభక్తుడు. అట్టి దేవదయానందుని వేదభాష్యములో **అశ్వినౌ** పదమునకు పరిమిత అర్థములెట్లుండును? అతడు చేసిన ఒకటిన్నర వేదముల భాష్యమునందే అశ్వినౌ పదమునకు అర్ధశతము(50కి)నకు పైగా అర్థములున్నవి. మిగిలిన రెండున్నర వేదములకు భాష్యము వ్రాయగల యవకాశము లభించియుండినచో మరెన్ని అర్థములు వ్రాయగలిగెడివారో ! ఆ వ్రాసినదియును తొందరతోనే.

ఆనాడు వేదాల పేరున జరిగే మూఢాచారాలను ఖండిస్తూ మీరు చేసే క్రియాకలాపాలకు వేదప్రమాణాలేవని ? నిగ్గదీసి అడిగేవాడు. కుంభమేళావంటి విస్తృత సార్వజనిక క్షేత్రాలలో **పాఖండఖండినీ** పతాకాన్ని ఎగురవేస్తూ నాతో వేదాలపై శాస్త్రార్థాన్ని (వాదోపవాదాలను) చేయుడని అహ్వానించేవాడు. మూఢాచార పరులు, సాంప్రదాయకులు వారి ఆచారాలకు వేదప్రమాణాలు చూపలేక ఓడిపోతూండేవారు. సర్వత్రా దయానందునికే విజయం లభించేది. దానితో వారిలో ద్వేషం పెరిగి దొడ్డిదారిలో దయానందుని మట్టుబెట్టు ప్రయత్నాలు చేసారు.

దీనికి తోడు విదేశీయులు దయానందుని విద్రోహ సంన్యాసిగా జమకట్టి పరోక్షంగా మూర్ఖ పండితులతో చేతులు కలిపారు. కారణమేమన దయానందుడు ధర్మప్రబోధముతోబాటు దేశభక్తిని, స్వాభిమానాన్ని ప్రేరేపిస్తూ ఉండేవాడు. స్వదేశీ వస్తువులతోనే సంతృప్తి చెందుతూ విదేశీవస్తువులను బహిష్కరించాలని ప్రబోధిస్తూ ఉండేవాడు. మన సంస్కృతీ సభ్యతలే మహోన్నతములనీ, విదేశీ సంస్కృతీ సభ్యతలు అనారోగ్యకరమని నచ్చచెప్పేవాడు. ప్రార్థనలలో ఓ పరమేశ్వరా ! మా దేశమాతను విదేశీ దాస్యశృంఖలాలనుండి విడిపించి, మాకు స్వాతంత్ర్యాన్ని ప్రసాదించు మని వేడుకొనేవాడు. వీటన్నిటిని ఆంగ్లేయగూఢచారులు పసిగట్టి పరోక్షంగా ప్రలోభాలు చూపి వారిని హతమార్చుటకై ప్రయత్నాలు చేయించేవారు.

ఎన్నో పర్యాయాలు ఆహారం ద్వారా విషప్రయోగం చేయించారు. వస్తి, ధౌతి, నౌళి వంటి క్రియలు చేస్తూ దయానందుడు ఆ విష ప్రభావాల నుండి బయట పడుతూండేవాడు. ఆ పరిస్థితులలో తానున్నా లేకున్నా తన వేద భాష్యం వివేకవంతులకు వెలుగుచూపగలదని వేదాలకు భాష్యం వ్రాయనారంభించాడు.

విక్రమ సం॥ 1932-1940 (క్రీ.శ. 1875-1883) మధ్యకాలంలో వీరి వేదభాష్య రచన సాగింది. ముందుగా ఒక నమూనాగా కొన్ని మంత్రాలకు వ్యాఖ్య వ్రాసి ప్రచురించారు. తదుపరి **చతుర్వేద విషయసూచీ** పేరుతో నాలుగు వేదాలలోనుగల వివిధ విషయాలను తెలుపుతూ ఒక పుస్తకం వ్రాసారు. అనంతరం ఋగ్వేదాది భాష్యభూమిక అనే పేరుతో వేదాలకు ఒక భూమికా గ్రంథాన్ని వ్రాసి ప్రచురించారు. విక్రమ సంవత్సరం 1934 మార్గశిర శు॥ 6 మంగళవారం(క్రీ.శ. 11-12-1877)

దినమున ఋగ్వేద భాష్య రచన ప్రారంభమయ్యింది. ఒక నెలరోజుల తదుపరి జ్ఞాన విషయక ఋగ్వేద భాష్య రచనతో బాటు విశుద్ధ కర్మకాండను తెలిపే యజుర్వేద భాష్యము ముందుగా అవసరమనే ఆలోచన కలిగింది. ఏలన, ఆనాడు వేదాల పేరుతోనే ముఖ్యంగా యజుర్వేద మంత్రాల ఆధారంగా అనేక మూఢాచారాలు, దురాచారాలు లోకములో ప్రచలితమై యుండేవి. వాటినుండి బయటపడితేగాని జాతి ఆంగ్లేయుల దాస్యబంధనాల నుండి విముక్తిని బొందజాలదని, జ్ఞాన విజ్ఞాన రంగాలలో పురోగమించజాలదని మహర్షి తమ క్రాంతదృష్టితో గుర్తించారు. అందుచే, వి.సం. 1934 పుష్య శు. 13 గురువారం (17-1-1875) నుండి యజుర్వేద భాష్య రచన కూడా ప్రారంభించారు. ఎన్నో అవాంతరాల నధిగమించి వి.సం. 1939 మాఘమాసం నాటికి యజుర్వేద భాష్యం (మొత్తం 1975 మంత్రాల భాష్యం) పూర్తిచేయగలిగారు. కాని ఋగ్వేదాన్ని పూర్తిచేయలేక పోయారు. అందుచే మహర్షి ఋగ్వేద భాష్యం సప్తమ మండలంలోని 625 సూక్తపు రెండవ మంత్రం వరకు మాత్రమే లభిస్తుంది. ఋగ్వేద మంత్ర సంఖ్య మొత్తం 10, 552 కాగా అందు దయానందుని భాష్యం 5, 649 మంత్రాలకు మాత్రమే లభిస్తుంది. అనగా సుమారు సగభాగము మాత్రమే. అదియును వైజ్ఞానికార్థాన్ని అసంపూర్తిగా సూచిస్తుంది. మొదటి కొన్ని మంత్రాలకు పారమార్థికార్థంతోబాటు వ్యావహారికార్థం (వైజ్ఞానికార్థం) వ్రాసారు. తదుపరి చాలా సంక్షిప్తంచేస్తూ వ్రాయటం జరిగింది. అందుచే చతుర్వేద విషయసూచిలో వ్రాసిన అనేకానేక విద్యలగురించి ఆయా మంత్రాలలో వివరించలేకపోయారు. చివరికి మహర్షి ఊహించినట్లే

వి.సం. 1940లో ప్రలోభాలకు, బెదిరింపులకు లోబడి తన వంట మనిషే ఆశ్వీయుజ బ॥ 14న పాషాణ విషం (అర్సెనిక్) పాలలో త్రాగించెను. ఆ భయంకర విషమే వారి మరణానికి కారణ మయ్యింది. వేదవిజ్ఞాన పునరుద్ధారకుడు ఆంగ్లేయుల కుట్రతో అస్తమించాడు.

అయినప్పటికి వారి ఒకటిన్నర వేదాల భాష్యమే వివేక వంతులకు గొప్ప మార్గదర్శక మయ్యింది. తదుపరి వారి అనుయాయులైన ఆర్యవిద్వాంసులు మిగిలిన రెండున్నర వేదాలకు చక్కటి భాష్యాలు వ్రాసారు. దయానందునికి పూర్వం వేదభాష్యాలన్నీ కేవలం సంస్కృతంలోనే ఉండేవి. సంస్కృతంరాని విద్వాంసులకు వివేకవంతులకు కూడా అవి దూరంగా ఉండేవి. కాని, దయానందుడు సాహసించి భాష్యాన్ని సంస్కృతంతోబాటు అధిక సంఖ్యాకులకు అవగతమయ్యే ఆర్యభాష (హిందీ) లోకూడా వ్రాసారు. అప్పటినుండి ఆర్యవిద్వాంసులేకాక అన్యవిద్వాంసులు కూడా ఆర్యభాష (హిందీ)లోను, ప్రాంతీయ భాషలలోను వేదాలకు వ్యాఖ్యానాలు వ్రాసారు.

ఇక, అట్టి ఆదర్శమహర్షి వేదభాష్యంలో అశ్వినీదేవతలకు గల అర్థాలలో కొన్ని ముఖ్యమైనవి తెలిసికొందాము.

జలాగ్నీ = జలము, అగ్ని

యజమాన ఋత్విజౌ = యజమాన ఋత్విక్కులు

ప్రాణాపానౌ = ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలు

వ్యవహార వ్యాపినౌ శిల్పజనౌ

సత్యోపదేశక రక్షితారౌ = సత్యమునుపదేశించి రక్షించువారు

ప్రశస్తదానశీలౌ పురుషౌ = మంచి దాన బుద్ధి గల మానవులు

శరీరాత్మబలయుక్తౌ (కుమారౌ) = శరీర ఆత్మ బలం కల యువకులు

రాజా z మాత్యౌ=రాజు మంత్రి
వ్యాపనశీలౌద్యావాన్తరిక్షే = వ్యాపించియున్న ద్యులోక, అంతరిక్షములు
వ్యాప్తిగుణశీలౌ అగ్నిజలే = వ్యాపించు గుణముగల అగ్ని జలములు
రాజప్రజాజనౌ =రాజు ప్రజలు
వ్యాప్తిమన్తౌ సూర్యాచంద్రమసౌ =సూర్యచంద్రులు
వాయువిద్యుతౌ =వాయు విద్యుత్‌లు
వ్యాప్తిశీలౌఇంద్రాగ్నీ = విద్యుత్ అగ్నులు
అగ్నివాయూ (యజు 21-36) = అగ్నివాయువులు
వాయుసూర్యౌ - (యజు. 21-49) = వాయు సూర్యులు
అగ్నిజలసూర్యచన్ద్రాదిభిః = అగ్ని జల, సూర్యచంద్రాదులు
శిల్పచాలకౌ -ఋ- 1-182-7 =శిల్పచాలకులు
అధ్యాపకోపదేశకౌ =అధ్యాపక ఉపదేశకులు
సత్యోపదేశక రక్షైతారౌ =సత్యోపదేశక రక్షకులు
ప్రశస్తదానశీల పురుషౌ =ప్రశస్త దానశీలురు గ్రహీతలు
గురుశిష్యౌ =గురుశిష్యులు
రాజాప్రజానౌ =రాజు ప్రజలు
వైద్యకవిద్యానిపుణాధ్యాపకోపదేశకౌ =వైదిక విద్యా నిపుణులైన అధ్యాపక ఉపదేశకులు

'అశ్వినీదేవతలకు గల పై అర్థాలలో చికిత్సకులు - వైద్యులు అనే అర్థాలు లేవుకదా! 'అనే సందేహం రావచ్చు. కాని, సూక్ష్మంగా ఆలోచిస్తే పైన పేర్కొన్న వారందరు వైద్యులే. కొందరు శారీరక వైద్యులయితే, కొందరు మానసిక , బౌద్ధిక, ఆత్మిక చికిత్సకులు.

మరికొందరు మానవ సమాజంలో ఏర్పడే వివిధ మూఢాచారాలక దురాచారలకు చికిత్సచేసే సంస్కర్తలు, గురువులు, రాజుల మొదలగువారు.

జలాగ్నులు, ప్రాణాపానములు, అగ్నివాయువులు వాయుసూర్యులు, సూర్యచంద్రులు మొదలైనవి జడపదార్థాలైనప్పటి అనగా జ్ఞానంలేని భౌతిక పదార్థాలైనప్పటికి వాటిని మన బుద్ధిత చక్కగా వినియోగించుకుంటే గొప్ప చికిత్సకులే అవుతాయి. వీటిని గురించి మాచే ప్రచురింపబడిన **వేదాలలో జలచికిత్స, వేదాలలో సూర్యకిరణ చికిత్స** అనే గ్రంథాలు చదివితే చాలావరకు మీకు అవగతమగును. మీకు దగ్గరలో ఉన్న ప్రకృతి వైద్యులను సంప్రతిస్తే మరింత స్పష్టమౌతుంది.

విద్యావంతులు, సదాచారపరులునైన మాతా పితరుల ద్వారా, అధ్యాపక ఉపదేశకుల ద్వారా పిల్లలకు మానసిక బౌద్ధిక చికిత్సలు జరుగుతాయి. పిల్లల జీవన వికాసం జరుగుతుంది. గురుశిష్య పరంపర ద్వారా ముందుతరాలలో విద్య వ్యాపిస్తుంది. యోగ్యులు, నిజాయితీపరులు నైన రాజామాత్యుల ద్వారా (అనగా నేటి అధ్యక్ష మంత్రుల వ్యవస్థవల్ల) మానవుల జీవనబాధలు తొలగిపోతాయి. చక్కటి రక్షణ, పురోభివృద్ధి కలుగుతాయి. ఉత్తములైన న్యాయవాది న్యాయనిర్ణేతల (అడ్వకేట్స్ మరియు జడ్జీలు) వలన అన్యాయపు బాధలు నివృత్తి అవుతాయి. ఆత్మస్థైర్యం నెలకొంటుంది. శిల్ప నిర్మాతలు చాలకులు అనగా వివిధ యంత్రాల నిర్మాతలు (ఇంజనీర్స్) మరియు వాటిని చక్కగా నడిపేవారు (డ్రైవర్లు, ఆపరేటర్లు) మన జీవన యాత్రలో ఏర్పడే యిబ్బందులను, కష్టాలను తొలగించి మన జీవితాన్ని సుఖమయం చేస్తారు. అయితే శారీరక ఔషధ శస్త్రచికిత్సకు

ఫిజిషియన్స్ మరియు సర్జన్స్) లనే విషయం వేదాలలో లేదా ? అనే సందేహం మీకు కలుగువచ్చు. అటువంటి అర్థాలు కూడా అక్కడక్కడ ఉన్నాయి. ఉదాహరణకు ఈ క్రింది మంత్రం గమనించండి.

ఋగ్వేదం మొదటి మండలంలో 6 మంత్రాలుగల 157వ సూక్తానికి దేవత - అశ్వినౌ అనగా ఈమంత్రాలలో జంట అశ్వినులగురించి చెప్పబడింది. అందు వైద్యుల గుణగణాలను వర్ణిస్తూ చివరి మంత్రం ఈ విధంగా వర్ణిస్తుంది.

**యువం హ స్థో భిషజా భేషజేభిర్ అతో**
**హ స్థా రథ్యా 3 రాథేభిః ॥ . . . . . (ఋగ్వేదము 1-157-6)**

ఓ వైద్యక అశ్వినులారా !మీరిద్దరు ఉత్తమోత్తమ ఔషధయుక్తులై ఉన్నారు. ఇంతేగాక మీరు ఆపదలో ఆదుకొనుటకై వేగముగ ప్రయనించగల యోగ్యమైన అశ్వయుక్త రథములను కలిగి ఉన్నారు....

పై ఋగ్వేద వాక్యం వైద్యులు కలిగి ఉండవలసిన రెండు ముఖ్యమైన అర్హతలను సూచిస్తున్నది. మొదటిది వైద్యులు ఎటువంటి అత్యవసర పరిస్థితినైనా ఎదుర్కొనగల ఉత్తమోత్తమ ఔషధాలను తమవద్ద ఎల్లప్పుడు ఉంచుకోవాలి. రెండవది - ఆపదలోనున్న రోగి ఎంత దూరములోనున్నా అత్యంత వేగముగా ప్రయనించి చేరుకోగల రథములను అనగా వాహనములను (అంబులెన్స్, కారు, స్కూటర్ వంటివాటిని) కలిగి ఉండాలి.

మరొకమంత్రం ఋగ్వేదం 8వ మండలంలో కనబడుతుంది. ఈ మంత్ర దేవత (విషయం) కూడా అశ్వినౌ

**ఉత స్థా దైవ్యా భిషజా శం నః కరతో అశ్వినా ।**
**యుయుయాతా మితో రపో ఉప స్రిధః ॥** (ఋ. 8-18-8)

ఓ దివ్యగుణ సంపన్న వైద్యక అశ్వినులారా! మా రోగములను ఉపశమింపజేయుడు. మరియు మాలోని దురభ్యాసములను, దురాచారములను దూరము చేయుడు. అట్లే చికిత్సకు అడ్డుతగులు ప్రేరకాలను కూడా తొలగించుడు.

అట్లే మరొక మంత్రం మంచి వైద్యుల గురించిన ప్రచారం చేయుమంటుంది.

**పురాణా వాం వీర్యా3 ప్ర బ్రవా జనే z థో ।**
**హాసధుర్ భిషజా మయోభువ ।**

ఓ వైద్యక అశ్వినులారా! మీరిరువురు ఎన్నో అద్భుత చికిత్సలుచేసిన గొప్ప అనుభవ వైద్యులు. మేము మీ చికిత్సా నైపుణ్యమును ప్రజలలో వ్యాపింపజేయుదుము గాక ! అందుచే మీద్వారా మరెందరో స్వస్థులగుదురుగాక !

ఇటువంటివే మరికొన్ని వైద్యక అశ్వినులను గురించి తెలిపే మంత్రాలు నాలుగు వేదాలలోను ఉన్నాయి.

మహర్షి దయానందుడు మరికొంత కాలం బ్రతికి ఉంటే నాలుగు వేదాలకు భాష్యము వ్రాయగలిగి యుంటే, పారమార్థికంతో బాటు వ్యావహారికార్థం (వైజ్ఞానికార్థం) కూడా వ్రాసేవాడు. మరెందరో అశ్వినులు మనకు లభించేవారు. వారు అసంప్రజ్ఞాత సమాధివరకు చేరుకొన్న గొప్ప యోగి కనుక ఆయా చికిత్సాపద్ధతులను, యంత్రాదుల నిర్మాణమును వివరించి యుండేవారు. అట్టి అదృష్టం మనకు లేకుండా పోయింది. ఇక శస్త్రచికిత్సనుగురించి వేదాలు ఏమి చెబుతున్నాయో తెలిసికొందాము.

# వేదాలలో శస్త్రచికిత్సా ప్రేరణలు

ఇక శస్త్రచికిత్స విషయంలో ఆలోచిస్తే అనేకానేక ప్రేరణలు వేదాలలో కనబడతాయి. అయితే అవి ప్రేరణలేకాని ఆయా శస్త్రచికిత్సా పద్ధతులు కావు. అట్లని అవి మానవులకు అసాధ్యమైనవి కావు. కష్టసాధ్యమైనవి మాత్రమే. వాటితో ప్రేరణను బొంది మనన చింతనలు చేస్తూ, పరిశోధనలు ప్రయోగాలు చేస్తూ ముందుకు సాగిపోతే అవి తప్పక మానవసాధ్యమౌతాయి. వైద్యకవిద్యా యోగ్యతను బొంది పూర్ణపురుషార్థం చేస్తూ విశుద్ధ మనస్సుతో అంతర్ముఖులమై అంతర్యామియైన పరమాత్మను ప్రార్థిస్తే అందుకు తగిన విశిష్టజ్ఞానం మనకు కలుగుతుంది. అట్టి ప్రయత్నమే మన ప్రాచీన ఆయుర్వేద ఋషులు (వైద్యులు) చేసారు. అద్భుత శస్త్రచికిత్సలు చేసారు. ఆ కోవకు చెందినవారే ధన్వంతరి, సుశ్రుతుడు, చరకుడు మొదలైనవారు. ముందుగా వేదాలలో కనబడే ప్రేరణ లేవో తెలిసికొందాము. తదుపరి సుశ్రుతంలో కనబడే చికిత్సా పద్ధతులేవో సంక్షిప్తంగా చెప్పుకుందాము.

సద్యా జంఘా మాంకుసీం విశ్పలాయై ధనే హితే
సక్తవే ప్రత్యదత్తమ్ (ఋ. 1-116-15)

ఓ అశ్వినులారా!

ప్రమాదవశమున యుద్ధములో కాలు విరిగిన (విశ్పలాయై) సేనానాయకునికి వెంటనే ఇనుపకాలు నమర్చి నడిపించుడు.

త్రిధా హ శ్యావమశ్వినా వికస్తముజ్జీవస
ఐరయతమ్ సుదాను (ఋ. 1-117-24)

ఓ వైద్యక అశ్వినులారా! మీరు మూడుచోట్ల తెగిన (శ్యావమ్)

వ్యక్తిని శస్త్రచికిత్సద్వారా అతికించి జీవింపజేయగల సమర్థులు

అక్షీ ఋజ్రాశ్వే అశ్వినా వదత్తమ్

జ్యోతి రన్ధాయ చక్రథుః విచక్షే ॥ 1-117-17)

ఓ అశ్వినులారా ! మీరిరువురు (ఋజ్రాశ్వే)

కన్నుల నమర్చి చూపు తెప్పించగలరు.

అస్థ్నః ఛిన్నస్య - (అథర్వ. 4-12-1)

విరిగిన ఎముకల నతికించుడు.

యద్ దణ్డేన యదిష్వా యద్ వారుర్హసాకృతమ్

(అథర్వ. 5-5-4)

దండము (కట్టె) ,బాణము, నిప్పు మొదలైన వాటివలన కలిగిన గాయములను కుట్లువేసి మాన్పుడు.

యత్ తేరిష్టం యత్ తే ద్యుత్తమస్తి పేష్టం త ఆత్మని' -

అథర్వ. (4-12-2)

ఓ క్షత్రగ్రస్తులారా! మీ శరీరములు కత్తి మొదలగు శస్త్రాదుల వలన తెగిగాయమైనను, నిప్పువలన కాలినను, నలిగినను వివిధ శస్త్రచికిత్సలద్వారా, ఔషధముల ద్వారా సరిచేయ వీలగును.

యది కర్తం పతిత్వా నం శశ్రేయదివాశ్మా ప్రహృతో జఘాన ,

ఋ భూ రథస్యేవాఙ్గాని సందధత్ పరుషా పరుః ॥ట

(అథర్వ. 4-12-7)

ఓ వైద్యుడా ! విరిగిపోయిన రథాంగములను వడ్రంగి మరల అతికి సరిచేసినట్లు శస్త్రాస్త్రములచే ఏర్పడిన గాయములను, విరిగిన ఎముకలను నీవు సరిచేయగలవు.

యాం తే రుద్ర ఇషుమాస్యదజ్గేభ్యో హృదయాయ చ ।
ఇదం తా మద్య త్వద్ వయం విషూచీం విబ్రుహామసి ॥
(అథర్వ. 6-90-1)

ఓ రుద్రుడా! రౌద్రముతో యుద్ధముచేయు ఓ సైనికుడా! దుఃఖములపాలుజేయు శత్రువులు నీ శరీరావయవములను బాణములతో కొట్టిరి. ఆ పీడాకరములగు బాణములను శల్యచికిత్సా విశారదులమగు మేము తొలగించి తగిన చికిత్స చేయుదుము.

బాణములు దిగుటవలన రక్తనాళములలో చేరిన విషమును తొలగించవచ్చునను ప్రేరణ ఈ క్రిందిమంత్రమునగలదు.

యాస్తే శతం ధమనయోఽజ్గా న్యనువిష్ఠితాః ।
తాసాం తే సర్వసాం వయం నిర్విషాణి హ్వయామసి
(అథర్వ. 6-90-2)

అర్థం : ఓ సైనికుడా! నీ శరీరములో వందలకొలది ధమనులు (శుద్ధ రక్త నాళములు - అర్టర్లరీస్) వ్యాపించియున్నవి. బాణములు దిగబడుట వలన వాటిలో విషము ప్రవేశించినది. వైద్యులమైన మేము ఆ ధమనులలోని విషములను తొలగించగలము.

నేడు మనం ఇనుముతో ఏదైనా గాయమైతే (సెప్టిక్) విషము అవుతుందని దానికి తగిన ఇంజక్షన్లు తీసుకుంటున్నాము. పై వేదమంత్రాన్ని బట్టి ఈ విషయం వేదంలోనే కలదని తెలుస్తున్నది.

ఇటువంటి వైద్య ప్రేరణలు వేదాలలో వందలసంఖ్యలో ఉన్నాయి. అయితే ఈ ప్రేరణలతోబాటుకొన్ని పేర్లు కూడా కనబడతాయి. అశ్వనీదేవతలు కణ్వునకు నేత్రదానం చేసారనీ, పరావృజునకు నేత్రచికిత్సతోబాటు పాదాలకు చికిత్స చేసారనీ, నారదునకు శ్రవణ చికిత్సచేశారనునట్టివి. ఇవి ఋషుల నామములా

లేక వీటికి వేరే అర్థములు గలవా ? అనే విషయం తదుపరి ప్రకరణంలో తెలిసి కొందాము.

ఇక మనం మన ప్రాచీన ఆయుర్వేద గ్రంథాలను పరిశీలిస్తే ఆనాటి శస్త్రచికిత్సా పద్ధతులు ఈ విధంగా ఉన్నాయి.

సుశ్రుత సంహిత ప్రకారం శస్త్ర చికిత్స 8 విధములు :

1) **ఛేదన** (Excision) - కంతులు (Tumours) మొలలు (Piles) మూత్రానాళంలో రాళ్ళు (Renal Stones) పిత్తాశయ రాళ్ళు మొదలగునవి కోసి తొలగించుట
2) **భేదన** (Incision) కురుపులు, రాచకురుపులు మొదలగువాటిని చీరి అందరి చీము, దుష్టరక్తములను తొలగించుట.
3) **లేఖన** (Scraping) (దంతములపై, ఎముకలపై ఏర్పడు పెరుగుదలను ) పొట్టు తీయునట్లు గీకుట
4) **వేధన** (Puncturing) – రంధ్రముచేసి లోని బాధకారకాలను తొలగించుట.
5) **ఏషణ** (Probing, Exploration). లేసర్ కిరణ చికిత్సవంటిది
6) **ఆహరణ** (Extraction) - ముళ్ళు, తుపాకి గుండ్లు మొదలగునవి తొలగించునట్టి క్రియ.
7) **విస్రావణ** : (Drainage) రక్తము, చీము బయటకు స్రవింప జేయుట
8) **సీవన** (Stiching) - కుట్లువేసి కలుపుట .

వాగ్భటాచార్యుడు తన అష్టాంగహృదయమనెడి చికిత్సా గ్రంథమునందు 5 రకముల శస్త్ర చికిత్సా ప్రక్రియలను సూచించెను.

1) కుట్టన (Pricking) : సూదితో చర్మముపై గ్రుచ్చుట
2) మన్థన (Drilling) : రంధ్రము చేయుట
3) గ్రహణ (Catching) : పట్టీ వేయటం
4) దహన : (Coutery) : కాల్చుట.
5) ఉత్పటన (Extraction) : లాగుట

పై వానిలోని దహన క్రియనే సుశ్రుతుడు అగ్నితప్తేన శస్త్రేణ ఛిన్ద్యాత్ - అగ్నితప్తమైన శస్త్రముతో ఛేదించు" అని అన్నాడు. దీనిని నేడు కాటరీ నైఫ్ (Cautery Knife) అంటున్నారు.

అథర్వవేదం ఏయే వ్యాధులలో ఏయే శస్త్రచికిత్సలు ఉపయుక్తముగా నుండునో స్వల్పంగా సూచిస్తుంది.

మూత్రావరోధంలో భేదన క్రియ (ఛినద్మ్యస్య బన్ధనమ్) మూఢగర్భచికిత్సలో భేదన క్రియ (అ-1-3-7) (అ 6-14-2)

విద్రధి (పెద్ద వ్రణాలకు) వేదనక్రియ (అ.6-35-1)

రక్తస్రావాలలో ధమనీబంధన క్రియ (అ-1-17-1 నుండి 4) ఒకవేళ బాణం గ్రుచ్చుకొని రక్తస్రావం జరుగుతూ ఉంటే జలచికిత్స (అ-6-57-1నుండి 4), ఏదైనా వ్రణం పెరుగుతున్న దానిని తొందరగా పక్వముచేసి చీమును కారిపోవునట్లు చేయు విధానము(అ.2-3-5), జలోదరములో విస్రావణ క్రియ (అ.9-8-9) అట్లే ఏయే వ్యాధులలో ఏయే ఔషధాలు ఉపయుక్తంగా ఉంటాయో కొన్ని సూచనలు ఉన్నాయి.

అథర్వవేదం 4-12-1 నుండి 7 మంత్రాలుగల ఈ సూక్తంలో విరిగిన ఎముకలను, తెగిన అంగములను జోడించి, మాంస మజ్జాచర్మములను కూడా సరిగా జోడించి రోహిణీ లక్క (లాక్షా) వనమూలికను ప్రయోగించు విధానము గలదు. మెడభాగంలో

ఏర్పడు గండమాల (Goitre or TB Glands) చీముపట్టి స్రవించు చుండిన దానిని శుద్ధిచేసి ఔషధము ప్రయోగించు విధి అథర్వవేదపు 8వ కాండములోని 72వ సూక్తం రెండవ మంత్రంలో చెప్పబడింది. ఈ విధంగా అనేక శస్త్ర చికిత్సాప్రేరణలు, ఔషధాలు వేదాలలో ఉన్నాయి. అవి అన్నీ సూత్రప్రాయ జ్ఞానం మాత్రమే. దాని విస్తృత రూపం చరక, సుశ్రుత, అష్టాంగ హృదయాది వైద్యశాస్త్రాలు. అవికూడా ప్రాచీన గ్రంథాలే. తదుపరికూడా ఎన్నెన్నో పరిశోధనలు, ప్రయోగాలు జరుగుతూ బౌద్ధుల కాలంనాటికి మన దేశంలో అనేక వ్యాధుల చికిత్సకు వేరువేరుగా సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రులుండేవి. ఎన్నియో ఆయుర్వేద గ్రంథాలుండేవి.గ్రంథాలన్నీ మహమ్మదీయుల మతోన్మాదానికి మసికాగా, వైద్యుల కళాకారుల నైపుణ్యమంతా ఆంగ్లేయుల కుటిల శాసనాలతో నశించిపోయింది. జాతి నిర్వీర్యమైపోయింది.

ఇక ఈ విషయం ఇంతటితో ముగించి వేదాలలో అశ్వినీదేవతలగురించి మరికొన్ని విషయాలు తెలిసికొందాము ముఖ్యంగా వేదాలలో చారిత్రక కథలున్నాయా ? లేవా ?



# వేదాలలో చారిత్రక కథ లున్నాయా ?

వేదాలు అపౌరుషేయ గ్రంథాలు. అంటే మానవులచే రచింపబడినవి కావు. వాటి ద్వారానే సృష్ట్యాదిలో పరమేశ్వరుడు మానవులకు కావలసిన జ్ఞానాన్నంతా ప్రసాదించాడు. అట్లని నేడు మనం చూచే పుస్తకాలరూపంలో ఇవ్వలేదు. సమాధిస్థులైన నలుగురు ఋషుల బుద్ధిలో వాటిని ప్రకాశపరచాడు. తదుపరి వారు యోగ్యులైన శిష్యులకు (విద్యార్థులకు) ఉపదేశించారు. ఇట్లే చాలా తరాలవరకు గురుశిష్య పరంపరగా వింటూ వినిపిస్తూ ఈ ఈశ్వరీయ జ్ఞానాన్ని కాపాడుకుంటూ వచ్చారు. అందుచేతనే వేదాలకు శ్రుతు లనేపేరు స్థిరమైపోయింది.

కాలాంతరములో మానవుల మేధస్సు-ధారణశక్తి (జ్ఞాపకశక్తి) తగ్గిపోతూ ఉండటం గమనించిన ఋషులు వాటిని గ్రంథస్థం చేసారు. సృష్ట్యాదిలోనే లభించిన అట్టి వేదాలలో మానవుల చరిత్రకు సంబంధించిన కథ లెట్లుంటాయి? రామాయణ కథలు భారతంలో కనబడవచ్చుకాని, భారత కథలు రామాయణంలో ఎలా ఉంటాయి.

అయితే కొందరు పరమేశ్వరునితో పని ఏముంది? మానవులలో క్రమంగా జ్ఞానవికాసం జరిగి ఒక పరిపక్వస్థితికి వచ్చినపుడు కొందరు మేధావులు వేదాలను రచించి ఉంటారు, ఆ మేధావులనే మీరు ఋషులంటున్నారని తర్కించ యత్నింతురు. అందుచేతనే ఆ రచయితల పూర్వుల చరిత్రలు అక్కడక్కడ కనబడుతున్నాయని వారి అభిప్రాయం. ఈవిషయం స్పష్టం కావాలంటే మానవులలో జ్ఞాన వికాసం ఎలా అవుతున్నది? అని పరిశీలించవలసి ఉంటుంది.

సూక్ష్మంగా పరిశీలిస్తే మానవులకు జ్ఞానం నైమిత్తికంగా కలుగుతున్నది కాని స్వాభావికంగా కాదు. నైమిత్తికంగా అంటే ఏదైనా నిమిత్తం (కారణం - ఇతరుల సహాయం) వలన కలగడం. ఋషుల పరిశీలనలో తేలిన దేమంటే

**మాతృమాన్ పితృమాన్ ఆచార్యవాన్ పురుషో వేద** - (శతపథ బ్రాహ్మణము - 14-5-8-2)

తల్లివలన, తండ్రివలన, ఆచార్యుల (గురువుల) వలన మానవులకు జ్ఞానం (విజ్ఞానం) కలుగుతున్నది. ఎంతటి విద్యావంతులు, సుశీలురు, సదాచారపరులునైన మాతా పితరులు ఆచార్యులు లభిస్తే అంత ఎక్కువగా, విశేషంగా జ్ఞానం కలుగుతుంది. దీనిని మేము వివరించ నవసరంలేదు. ఎవరికి వారు ఆలోచించిన తెలియగలదు.

కేవలం విద్యా సుశీలతలేకావు సామాన్య జీవన నిర్వహణ జ్ఞానంకూడా మనకు నిమిత్తం వల్లనే కలుగుతున్నది. ఎట్లన - పశుపక్ష్యాదులు ఆయా జన్మలలోనే వాటి జీవనావసర జ్ఞానం కలిగిఉంటాయి. పుట్టిన కొన్ని క్షణాలకే పశువులు నడువగలవు పక్షులు ఎగురగలవు. జలచరాలు ఈదులాడగలవు. అన్ని జంతువులు వాటి వాటి స్వాభావికాహారాలను గుర్తుపట్టి సంపాదించుకోగలవు క్షీరజ జాతి జంతువులలో కూడా తల్లిసాయం కొద్ది దినాలే. మానవులల అట్లుకాదు. సామాన్య జ్ఞానం కూడా పరుల సహకారం వల్లనే కలుగుతున్నది. నడక, తినటం, త్రాగటం, మాట్లాడటం వంటివికూడ ఇతరులు నేర్పాలి. లేకుంటే రావు. ఇది కేవలం ఊహగానం కాదు ప్రత్యక్ష పరిశోధనలలో తేలినదే.

చరిత్రను పరిశీలిస్తే విదేశాలలో ఈ పరిశోధన చేసినవారు ముగ్గురు కనబడతారు. వారు అసీరియా సామ్రాట్ అసురవాణీపాల్ యూనాన్ దేశపు రాజు సేమిటికల్, ఫ్రేడరిక స్కాట్‌లాండ్ సామ్రాట్ చతుర్థజేమ్స్. వీరేకాక మనదేశాన్ని పాలించిన మొగల్ బాదుషా అక్బరు కూడా మానవులలో జ్ఞానవికాసం స్వాభావికమా? కాదా ? అని పరీక్షలు నిర్వహించాడు. వీరు పసిపిల్లలను కొందరిని జన సంచారము ఎంతమాత్రములేని అడవులకు తీసుకువెళ్లి అక్కడ మూగదాదులను ఏర్పాటుచేసి ఈ పరీక్షలు నిర్వహించారు. ఆ మూగదాదులు కేవలం వారిని పోషించారేకాని ఏమీ నేర్పలేదు. పిల్లలు క్రమంగా పెద్దవారయ్యారు. శరీరం పెరిగిందేగాని బుద్ధి ఏ మాత్రం పెరగలేదు. నడక, నడవడి, వ్యవహారము అంతా పశువుల-మాదిరిగానే తయారయ్యింది. ఈ పరీక్షలు క్రూరమైనవే అయినప్పటికి ఇతరుల సహాయం లేకుండా మానవుల జ్ఞానం పెరుగదనే విషయం ప్రత్యక్షంగా లోకానికి తెలిసింది.

ఇట్లే, చాలాకాలం క్రితం వార్తాపత్రికలలో ఒక అరుదైన వార్త ప్రచురించారు. ఉత్తరప్రదేశ్ అడవులలో తోడేలువలె వ్యవహరించు ఒక బాలుని కనుగొన్నారు. అతడిని లక్నోలోని గాంధీ ఆసుపత్రిలో నుంచి పరీక్షించి చూచారు. రాము అని పేరు పెట్టారు. వాడు పశువులవలెనే అరచుట, నడచుట, మనుష్యులను చూచి భయపడుట, పచ్చిమాంసమునే తినుట మొదలగునవి గమనించారు. అప్పటికే 10, 15 సంవత్సరాల వాడైనప్పటికి ఏ భాషా శబ్దము, రాలేదు. తదుపరి అతడు తోడేలుచే పెంచబడిన బాలుడని తేలింది. అనాటి ఉత్తరప్రదేశ్ గవర్నర్ గారైన శ్రీ కన్హయ్యాలాల్ మున్షీగారే పై వార్తను

వార్తాపత్రికలలో ప్రకటించారు. జనం తండోపతండలుగా వచ్చి చూచి వెళ్ళారు. పై పరీక్షలవల్ల నిర్ధారణ అయినదేమంటే - మానవులలో ప్రాథమిక జ్ఞానం స్వాభావికంగా (దానంతట అదిగా) ఉండటం గాని, వయస్సుతోబాటు క్రమంగా పెరగటంగాని జరుగదు. ఇతరుల సహాయం అనివార్యం. ఇందుకు ఆటవిక జాతులు మరొక ప్రమాణం. వందల వేల తరాలు గడుస్తున్నా నాగరిక ప్రపంచానికి దూరంగా ఉన్న ఆటవిక జాతులలో జ్ఞానం పెరగటం లేదు. ఎప్పుడైతే వారు నాగరిక ప్రపంచంతో సంబంధం ఏర్పరచుకుంటారో అప్పుడు వారి జ్ఞానం క్రమంగా పెరగటం అందరు ఎరిగినదే. అయితే సృష్ట్యాదిలో మానవులకు జ్ఞానం ఎలా ప్రాప్తించింది ? ఆది సృష్టిలో మాతా పితరులు ఆచార్యులు ఉండరు కదా ! కనుక, వైదిక సిద్ధాంతం చెప్పినట్లు ప్రథమ మానవసృష్టిలో సృష్టికర్తయైన పరమేశ్వరుని ద్వారానే మానవులకు జ్ఞానం లభించింది. అందుచే వేదాలలో చరిత్రలు ఉండవు. కాలాంతరములో వేదములోని పదములను చూసి ఋషులు, మునులు, రాజులు, వ్యక్తులు వారి సంతానమునకు వారికి నచ్చినపేర్లు పెట్టుకున్నారు. నగరముల పేర్లును అట్టివే. మనుధర్మశాస్త్ర కథనం ప్రకారం సృష్టిలోని పదార్థాలన్నిటికి వేదపదములతోనే నామకరణం జరిగింది.

సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్ పృథక్ ।
వేదశబ్దే ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే ॥

(మనుస్మృతి 1-13)

అయితే వేదాలలో పేర్లుగా కనబడే పదములు ఏమిటి ? అనే ప్రశ్న మిగిలిఉంటుంది. వేదవిద్వాంసుల కథనం ప్రకారం -

వేదాలలోని పదములన్నీ యౌగికములే. యౌగికములంటే మూల సంస్కృత ధాతువులకు కొన్ని ప్రత్యయములు కలుపగా ఏర్పడినవే. కనుక ప్రతి పదములోను దాని మూలార్థమే ప్రధానంగా ఉంటుంది. ఆ దృష్టితో మనం పరిశీలించి చూస్తే పేర్లుగా కనబడే ఆ పదములన్నీ కొన్ని గుణ కర్మలను తెలిపేవే. కాని ప్రత్యేక వ్యక్తులను సూచించేవి కావు. అందుచే వాటి యౌగికార్థాలనే గ్రహించి ప్రకరణానుగుణంగా అర్థం చెప్పకోవాలి. మన విషయం చికిత్స కనుక మనం ఆదృష్టితోనే వాటికి అర్థం చెప్పుకునే ప్రయత్నం చేద్దాము.

**అక్షీ ఋజ్రాశ్వే అశ్వినావదత్తం**

**జ్యోతిరన్ధాయ చక్రథుర్విచక్షే ॥ (ఋ.1-117-17)**

అశ్వినీ దేవతలు (ఔషధ శస్త్రచికిత్సా నిపుణులు) ప్రమాదవశమున అంధుడైన ఋజ్రాశ్వునకు (ఋజుమార్గమున వేగముగా పయనించు సేనానాయకునకు) నేత్రముల నమర్చి చూడగలశక్తిని కలుగజేసిరి.

(మహర్షి దయానందుడు ఋజ్రాశ్వే పదమునకు - సుశిక్షిత తురంగాది సైన్యే' అని ప్రకరణానుగుణంగా అర్థము చెప్పియుండిరి. మరొకచోట 'ఋజ్రాశ్వః' - పదమునకు ఋజ్రా-ఋజవోzశ్వా మహాత్యో నీతయో యస్య నః (విద్వజ్జనః) అని చెప్పిరి. మూలశబ్దముల అర్థములు ఆయా ప్రకరణములను బట్టి చెప్పుకొనుట జరుగును. ఇక సంక్షిప్తంగా మరికొన్ని పదములను గురించి తెలిసికొందాము.

**2) మహః క్షోణస్యాశ్వినా కణ్వాయ (ఋ. 1-117-8)**

ఓ అశ్వినులారా ! మీరు దృష్టివిహీనుడైన కణ్వాయ

(మేధావంతునకు) దృష్టిని కలిగింపుడు. (కణ్వ ఇతి మేధావీనామ. నిఘంటువు 3-15)

3) **యువం శ్యావాయ రుశంతీమదత్తం (ఋ. 1-117-8-7)**

శ్యావాయ-జ్ఞానవంతులను సదా యౌవ్వనులుగా జేయుచు వారి నేత్రజ్యోతిని ప్రకాశపరచుడు.

(శ్యైజ్-గతౌ-జ్ఞానినే జనాయ (మహర్షి ద.)

4) **నార్షదాయ శ్రవో అధ్యదత్తమ్ (ఋ. 1-117-8)**

నార్షదాయ మహారాజు యొక్క పుత్రునకు శ్రవణశక్తిని వృద్ధిపరచుడు.

5) **త్రిధా హ శ్యావమశ్వినా వికస్తముజ్జీవస ఐరయత్ సుదానూ ॥ (ఋ-1-117-24)**

మూడుచోట్ల తెగిన శ్యావునికి (విద్వాంసునికి) మీరు చికిత్స చేసి జీవనమును ప్రసాదించితిరి.

6) **సద్యో జంఘామాయసీం విశ్పలాయై ధనే హితే సర్తవే ప్రత్యదత్తమ్ ॥ (ఋ. 1-116-15)**

ప్రమాదవశమున యుద్ధములో కాలువిరిగిన విశ్పలకు (పరోపకారిణియైన స్త్రీకి) వెంటనే కాలునమర్చి ముందుకు నడిపింపుడు.

7) **యద్ దణ్డేన యదిష్వా యద్ వారుర్హసా కృతమ్ ।**

**(అథర్వ. 5-5-4)**

బాణము, నిప్పు వలన కలిగిన గాయములను మాన్పుడు.

8) **అనష్టః ఛిన్నస్య (అథర్వ. 4-12-1)**

విరిగిన ఎముకలను అతుకుడు.

9) యది కర్తం పతిత్వా సంశశ్రేయదివాశ్మా ప్రహృతో జఘాన ।
ఋభూ రథస్యేవాఙ్గాని సందధత్   పరుషా పరుః ॥

(అథర్వ. 4-12-7)

ఓ వైద్యుడా! విరిగిపోయిన రథాంగములను వడ్రంగి అతికి సరిచేసినట్లు - విరిగిన శరీరాంగములను, అతుకుము. శస్త్రములచే గలిగిన గాయములను మాన్పుము, రాళ్ళు రువ్వుటచే ఏర్పడు దెబ్బలకు చికిత్స చేయుము. సడలిన కాళ్ళను సరిచేయుము. ఇట్టివే మరెన్నో శస్త్ర చికిత్సాప్రేరణలు అథర్వవేదమందు కనబడును.

పై విధంగా ధాతు ప్రత్యయాలను బట్టి, ప్రకరణాన్నిబట్టి వేదపదములు అర్థం చెప్పుకోవలసి ఉంటుంది. అప్పుడు వేదార్థం విశాలమై పారమార్థికంగా, సామాజికంగా, వైజ్ఞానికంగా అనేక విధాల అర్థం చెప్పుకునే వీలుంటుంది. ఇట్టి ఆర్షపరంపరను వీడి సాయణ, ఉవ్వట, మహీధరాది ఆచార్యులు వేదార్థమును సంకుచితముచేసి వాటికి భాష్యములు వ్రాసారు. అశ్వినులు ఋజ్రాశ్వ, శ్యావ, కణ్వాదులకు నేత్రములను, నార్షదునకు శ్రవణశక్తిని, మరెందరికో అద్భుత చికిత్సలను చేసినట్లు వ్రాసారు. దానితో ఆ పదములతో చారిత్రక వ్యక్తులకు సంబంధాలు అల్లటం ప్రారంభం అయ్యింది. విదేశీయులును ఆ మార్గమునే అనుసరించారు. దీనితో వేదాలు ఈశ్వరీయములు కావు, కాలాంతరంలో ఋషులు వ్రాసినవి అనే భావం ఏర్పడవచ్చును.

తదుపరి ఆంగ్లేయుల కుటిల రాజనీతికి భావదాస్యం చేస్తూ జర్మనీ పండితుడు మాక్సుముల్లర్ వేదాల గౌరవాన్ని మరింత దిగజార్చాడు. విజ్ఞానం వికసించని అజ్ఞాన దశలో ఆటవికులు, పాడుకున్న ప్రార్థనా గీతాలని వ్రాయుటం జరిగింది. అదే భావం

విద్యార్థులలో ప్రవేశపెట్టబడింది. మాక్సుముల్లరు వేదోత్పత్తి క్రీ.పూ. 1200 సం॥ అని వ్రాయగా, హాంగ్ పండితుడు కీ.పూ. 2400 సం॥ అని వ్రాసాడు. తిలక్ మహాశయుడు మరికొంత వెనుకకు వెళ్ళి కీ.పూ. 4000 సంవత్సరం అని వ్రాయటం జరిగింది. మహర్షి దయానందుడు అనేక ప్రమాణాలతో పై లెఖలన్నీ తప్పని నిరూపించి వేదోత్పత్తి జరిగి 197 కోట్ల సంవత్సరాలకు పైగా అయినట్లు సప్రమాణికంగా ఋజువు చేసాడు. మహర్షి దయానందుని భాష్యం వెలువడేవరకు వేదాల యథార్థస్వరూపం ఎవరికిని తెలియలేదు. ఆర్యవిద్వాంసు లెంతగానో వేదవిజ్ఞానాన్ని ప్రకాశపరచారు. అయినా కొందరు ప్రాత భావాలనే పట్టుకుని ప్రాకులాడుతున్నారు.

మాన్యశ్రీ పం. శ్రీపాద దామోదర సాత్వలేకర్ గారు గొప్ప విద్వాంసులు. తమ జీవితాన్నంతా వేదముల ప్రచారం కొరకే అంకితం చేసిన గొప్ప వేదభక్తులు. వారు నాలుగు వేదాలకు చక్కటి సరళ సుబోధ భాష్యము వ్రాసిన తపస్వి. వేదాలలో ఎన్నో విద్యలను ప్రకాశపరచిన గొప్ప పరిశోధకుడు. అంతటవారు కూడా వేదాలలో చరిత్ర ఉన్నట్లుగా వ్రాసారు. వీరు ఆర్యవిద్వాంసులైన బ్రహ్మశ్రీ పం. బ్రహ్మదత్త జిజ్ఞాసువుగారి సమకాలికులు. వీరిద్దరికి వేదాలలో చరిత్ర ఉన్నదా ? లేదా? అనే విషయంపై ఉత్తర ప్రత్యుత్తరాలు, వాదోపవాదాలు జరుగుతూ ఉండేవి. జిజ్ఞాసుగారు వేదాలలో చరిత్ర లేదనటానికి ఎన్నెన్నో ప్రమాణాలను చూపించేవారు. సాత్వలేకర్ గారు చరిత్ర ఉంది. అని నిరూపించే ఒక్కప్రమాణాన్ని కూడా చూపలేక పోయారు. కనుక వేదాలలో ఋషుల మరియు మానవుల చరిత్రలు ఏమి లేవు.

మనం ఇంతవరకు మన శరీరానికి బయట ఉండే వైద్య అశ్వినీదేవతలగురించి తెలిసికొన్నాము. అయితే వీరంతా ఒకప్పుడు మనకు అందుబాటులో ఉండవచ్చును. మరొకప్పుడు అందుబాటులో లేకపోవచ్చును. అందుచే దయామయుడగు పరమేశ్వరుడు మన శరీరంలోనే వైద్య అశ్వినీద్వయాన్ని ఏర్పాటు చేసాడు. ఆ అశ్వినులెవరో తెలుసా ?

## ప్రాణాపాన అశ్వినీదేవతలు

మనం లోనికి పీల్చుకునే గాలిని (ఉచ్ఛ్వాసను) ప్రాణవాయువు అంటారు. బయటకు వదలిపెట్టే వాయువును (నిఃశ్వాసమును) అపానవాయువు అంటారు. ఇవి రెండు సదా మనం జీవించి ఉన్నంత కాలం నడిచేవే. ఇవి మనకు జీవనాన్నేకాక ఆరోగ్యాన్ని, దీర్ఘాయువును, మానసిక ఏకాగ్రతను - తద్వారా శాంతిని ప్రసాదించగల వైద్యఅశ్వినీ దేవతలు. ఇవి మన చెప్పుచేతలలో ఉన్నవే కనుక వీటిని జ్ఞాన పూర్వకంగా నియమించి నడిపించుకుంటే అసలు రోగములే రావు. ఏ కారణంచేతనైనా కలిగినా తేలికగా - ఉపవాస, ఆహార నియమాదుల ద్వారా త్వరలో ఆరోగ్యవంతులము కాగలము. ఎవరిలో ప్రాణశక్తి బలముగా ఉంటుందో వారి శరీరంలో రోగ కారక క్రిములు జీవించలేవు. ఈ ప్రాణశక్తినే ప్రాణాగ్నిగా పేర్కొనటం జరిగింది. ఇందుకుమన వేద శాస్త్రాలలో ఎన్నో ప్రమాణాలు కనబడును. అథర్వవేద సప్తమ కాండములోని 53వ సూక్తం ప్రాణాపానములను బలపరచుకొని ఆరోగ్యవంతుడవై వర్ధిల్లుమని ప్రబోధిస్తుంది. అందలి కొన్ని ఈ విధంగా ఉన్నాయి.

సంక్రామతం మా జహీతం శరీరం
ప్రాణాపానౌ తే సయుజా విహస్తామ్ ।

**శతం జీవ శరదో వర్ధమానో z గ్నిష్టే గోపా అధిపా వశిష్ఠః ॥**
**(అథర్వ. 7-53-2)**

ఓ ప్రాణాపానములారా! మీ రిరువురు నా శరీరంలో నిరంతరం సంచరించుడు. శరీరమును విడిచి పోవద్దు. మీ రిద్దరు (సయుజా) గాఢమిత్రులై నాయందు సదా వసింపుడు. అప్పుడు నన్ను పెద్దలు శతం జీవ శరదో వర్ధమానః - ఓ మానవా! నీవు అన్ని విధాల వర్ధిల్లుచు నూరేళ్ళు జీవింతువుగాక! నీ శరీరమునందు ప్రాణాపానరూప వశిష్ట అగ్ని (వాసయోగ్యమైనఅగ్ని) నెలకొని సదా నిన్ను రక్షించును గాక!" అని ఆశీర్వదింతురు.

**ఆయుర్యత్ తే అతిహితం పరాచైరపానః**
**ప్రాణః పునరా తావితామ్ । (అ. 7-53-3)**

ఓ జీర్ణశీర్ణమానవా! పరాఙ్ముఖమైన నీ శారీరక శక్తులవలన నీ ఆయువు నిన్ను వదలి పోవుచున్నది. తిరిగి ప్రాణాపానములను నీలో ప్రవేశింపజేసుకో !

**మేమం ప్రాణో హాసీన్మో అపానో z వహాయ పరాగాత్ ।**
**(అ. 7-53-4)**

ప్రాణవాయువు మరియు అపానవాయువు నన్ను ఎప్పుడును వదిలి పోకుండును గాక !

**ప్ర విశతం ప్రాణాపానావనడ్వాహావివ వ్రజమ్ ।**
**(అ. 7-53-5)**

బండిని సమర్థవంతముగా లాగగల ఎద్దుల జంట గోశాలలో ప్రవేశించునట్లు బలమైన ప్రాణాపానములు నా జీర్ణశీర్ణ శరీరములో ప్రవేశించును గాక!

**అ తే ప్రాణం సువామసి పరా యక్ష్మం సువామి తే ।**

ఆయుర్నో విశ్వతో దధదయమగ్నిర్వరేణ్యం ॥ (అ. 7-53-6)

ఓ మానవ! వైద్యులమగు మేము నీ ప్రాణములను బలపరచి క్షయరోగమును పారద్రోలుదుము. వరించదగిన (కోరదగిన) జఠరాగ్ని నీకు పుష్టిని కలిగించును గాక !

అయితే ప్రాణాపానములు మనకు బలాన్ని, ఆరోగ్యాన్ని, ఎలా ఇవ్వగలుగుతాయి ? అనే విషయం తెలియాలి. అప్పుడే మనకు వాటిపై శ్రద్ధ కలుగుతుంది. ముందుగా ఆధునిక శరీర విజ్ఞానం ఏమి చెబుతున్నదో పరిశీలిద్దాము.

మన ఛాతీలోని ఎముకలగూటిలోపల గుండె, ఊపిరితిత్తులు ఉంటాయి. ఇవి రెండూ చాలా ప్రధానమైన అవయవాలు. ఇవి నిలిచిపోతే కొన్ని నిముషాలలోనే మరణం సంభవిస్తుంది. ఇందులో ఊపిరితిత్తులు ప్రాణవాయువును (ఆక్సిజన్‌ను) స్వీకరించేవి అయితే, దానిని శరీరంలోని ప్రతి కణానికి అందించేది గుండె. ఆ గుండె గుప్పెడి పరిమాణం గలిగిఉంటుంది. మిగిలిన ఛాతీయంతా ఊపిరితిత్తులు విస్తరించి ఉంటాయి. వీటి అకారం ద్రాక్షగుత్తులను పోలి ఉంటుంది. కుడివైపు మూడు గుత్తులు (లోబ్స్ తిత్తులు లేదా భాగములు) ఎడమవైపు గుండె ఉండుటవల్ల రెండు గుత్తులు (Lobes) ఉంటాయి. ద్రాక్షగుత్తిలోని పండ్లన్నీ కాండమునకు కలపబడినట్లు ప్రతి గాలిబుడగ (Alveoli) శ్వాసనాళాలతో Bronchial Tubes కలుపబడి ఉంటాయి ఇవేకాక మంచి చెడు రక్తనాళాలు, శోషరసనాళాలు, నరాలు అంతట విస్తరించి ఉంటాయి.

మనం ముక్కుతో గాలి పీల్చినపుడు అది శ్వాసనాళాల ద్వారా

ఊపిరితిత్తులలోని వాయుగోళాలలోనికి పోతుంది. అప్పటికే మ
శరీరంలో తయారైన కార్బన్ డై ఆక్సైడ్ మరికొన్ని దుష్టవాయువు
చెడు రక్తనాళాల ద్వారా ఆ వాయుగోళాలలోనికి చేరుకుంటుం
అప్పుడు రక్తంలోని హిమోగ్లోబిన్ (Haemoglobin - ఇనుము) మన
పీల్చుకున్న గాలిలోని ప్రాణవాయువు (ఆక్సిజన్) ను ఆకర్షించి తనవ
పెట్టుకుంటుంది. అందుచే వాయుగోళాలలో కొంతశాతం ఖా
ఏర్పడుతుంది. అప్పుడు రక్తంలోని కార్బన్ డై ఆక్సైడు
దుష్టవాయువులు వాయుగోళాలలోనికి వెళ్లి నిఃశ్వాసం ద్వార
బయటకు వెళ్ళిపోతాయి. ఈ విధంగా ఊపిరితిత్తులు రక్తాన్ని శుభ్ర
చేసే యంత్రమే కాక ప్రాణవాయువును - ప్రాణశక్తిని గ్రహించే అద్భు
సాధనాలు. ప్రతి శ్వాసతోను మనం గ్రహించే ప్రాణవాయువు ఎంత
ఉంటుందో ఈ క్రింది పట్టిక ద్వారా తెలుసుకోవచ్చు.

ఉచ్ఛ్వాస (పీల్చుకునే) వాయువులో

| | |
|---|---|
| నైట్రోజన్ (నత్రజని) నూటికి | 79 పాళ్లు, |
| ఆక్సిజన్ (ప్రాణవాయువు) | 20 పాళ్లు, |
| కార్బన్ డై ఆక్సైడు (బొగ్గుపులుసువాయువు) | 0.04 |

నిశ్వాస (వదిలే) వాయువులో

| | |
|---|---|
| నత్రజని | 79 పాళ్లు |
| ప్రాణవాయువు | 16 పాళ్లు |
| బొగ్గుపులుసు వాయువు | 4.04 పాళ్లు |

ఇవేకాక నిశ్వాస వాయువుతో కొన్ని జీవకణాలు, కళ్లె తుంపరలు, క్రిములు, దుష్టవాయువులు బయటకు పోతాయి. కొంత అధికవేడికూడా బహిర్గత మౌతుంది.

పై పట్టికను పరిశీలించినట్లయితే మనం తీసుకున్న ప్రతి శ్వాసలోనుండి 4 శాతం ప్రాణవాయువును గ్రహిస్తున్నాము అని తెలుస్తుంది. అంత పరిమాణం గల బొగ్గుపులుసు వాయువును విసర్జిస్తున్నాము. అంటే మనం ఎంత ఎక్కువగా గాలిని పీల్చుకోగలిగితే అంత ఎక్కువగా ప్రాణవాయువును - ప్రాణశక్తిని పొందవచ్చు.

మనం సాధారణంగా 500 ఘన సెంటీమీటర్ల గాలి పీల్చి విడుస్తూ ఉంటాము. ప్రయత్నం చేస్తే 4, 5 రెట్లు ఎక్కువగా గాలిని పీల్చగలుగుతాం. ఏలన మన ఊపిరితిత్తులు 4, 500 నుండి 5,000 ఘనసెంటీమీటర్ల గాలిని నింపుకోగల వైశాల్యం గలిగి ఉంటాయి. అంటే మనం సామాన్యంగా పీల్చి ఆపుకోగల గాలికన్న పదిరెట్లు గాలిని నింపుకోగలవు. అందుచేతనే క్షయ మొదలగు వ్యాధులలో ఊపిరితిత్తులలోని కొంతభాగం తీసివేసినా, ఒక తిత్తి పూర్తిగా తీసివేసినా రోగి బ్రతుకగలుగుతున్నాడు. శ్వాసవేగం పిల్లలలో కొంత ఎక్కువగా ఉన్నా పెద్దవారిలో నిముషానికి 18 పర్యాయాలుగా ఉంటుంది. స్త్రీలలో కొంత ఎక్కువగా ఉంటుంది. ప్రాణాయామ సాధకులలో ఈ వేగం చాలా తక్కువగా ఉండటం గమనార్హం నిముషానికి 10కి లోపుగానే ఉండటం చూడబడింది.

పై విధంగా స్వీకరింపబడిన ప్రాణవాయువు రక్త సంచారకోశము ద్వారా (గుండె, రక్తనాళాల ద్వారా) శరీరంలోని ప్రతి కణానికి అందించబడుతుంది. అదే శరీర వ్యాపారాలనన్నిటిని నడిపిస్తుంది. ఈ విషయంలో శరీర విజ్ఞానం యింతవరకే చెబుతుంది. కాని, మన వేదం చెప్పేది చాలా లోతుగా సూక్ష్మంగా ఉంది.

**ఆ వాత వాహి భేషజం వి వాత వాహి యద్రపః ।**
**త్వం హి విశ్వభేషజీ దేవానాం దూత ఈయసే ॥**

(ఋ. 10 -132-3)

చెట్లద్వారాను, అగ్నిహోత్రాదుల ద్వారాను వాయువు (గాలి) ఔషధమును (ప్రాణవాయువును, సూక్ష్మమైన మూలికలను) గ్రహించి మనకు అందిస్తుంది. మనలోని మలినాలను (కార్బన్ డై ఆక్సైడు మరియు దుష్టవాయువులను) దూరం చేస్తుంది. అది దేవదూత. సర్వఔషధములు అందులో ఉన్నాయి. ఇట్టి గుణములు గల ఆ గాలి నిరంతరం ప్రవహిస్తూ (వీస్తూ) ఉంటుంది.

పై వేదమంత్రం గాలి కేవలం ప్రాణవాయువునేగాక ఔషధములను కూడా మనకు అందిస్తుందని చెబుతున్నది. ఇట్టి మంత్రాల ఆధారంగానే ప్రాచీనకాలంలో రోగికి తగిన మూలికలతో యజ్ఞయాగాదులు చేసి ఆరోగ్యాన్ని కలిగించేవారు. ఈ విషయం వివరంగా తెలుసుకోగోరేవారు మాచే ప్రచురింపబడిన అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము, అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ చూడగోరెదము.

ఇట్టి సృష్టి రహస్యాలు తెలిసికోవడానికి మన ఋషులు వేదాలను అధ్యయనం చేసి పరిశోధించి, పరీక్షించి మరెన్నో విషయాలు తెలిసికొన్నారు. అద్భుతమైన ఆయుర్వేదాది గ్రంథాలు వ్రాసారు.

## ఆధ్యాత్మిక శాస్త్రాలలో ప్రాణశక్తి :

మనం స్వీకరించేది ఒకేరకమైన ప్రాణవాయువు అయినప్పటికి ంది మన శరీరంలో పది రకాల పనులను నిర్వర్తిస్తుంది. అందుచే మన ఋషులు ప్రాణశక్తిని పది భాగాలుగా వర్గీకరించి, వాటికి పదిపేర్లు పెట్టటం జరిగింది. అవి ఏవి యనగా -

ప్రాణాపానః సమాన శ్చోదాన వ్యానౌ చ వాయవః ।
నాగ కూర్మో Z థ కృకలో దేవదత్తో ధనం జయ ః ॥

(గోరక్షా సంహిత)

ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము అను అయిదును ముఖ్యమైన వాయువులు. వీటి అంతర్గతముగా నాగము, కూర్మము కృకలము, దేవదత్తము, ధనంజయము అను అయిదును ఉపవాయువులుగా నుండును.

ఇక నివిచేయు పనులేవో సంక్షిప్తముగా ఈ క్రింది విధముగా చెప్పబడినది.

నిఃశ్వాసోచ్ఛ్వాస కాసాశ్చ ప్రాణకర్మేతి కీర్తితః ।
అపానవాయోః కర్మైతత్ విణ్మూత్రాది విసర్జనమ్ ॥
హనోపాదాన చేష్టాది వ్యానకర్మేతి చేష్యతే ।
ఉదానకర్మ తత్ ప్రోక్తం దేహస్యోన్నయనాది యత్ ॥
పోషణాది సమానస్య శరీరే కర్మ కీర్తితమ్ ।
ఉద్గారాది గుణో యస్తు నాగకర్మేతి చోచ్యతే ॥
నిమీలనాది కూర్మస్య క్షుతం వై కృకలస్య చ ।
దేవదత్తస్య విప్రేన్ద్ర తన్ద్రీకర్మేతి కీర్తితమ్ ॥
ధనంజయస్య శోఫాది సర్వకర్మ ప్రకీర్తితమ్ ।

(యోగీ యాజ్ఞవల్క్య 4వ అధ్యాయం 66 నుండి 69)

ఉచ్ఛ్వాసనిశ్వాసములు, దగ్గు మొ.నవి ప్రాణవాయువుచే కలుగు క్రియలు. మూత్ర పురీష స్వేదాదులు అపానవాయువుచేతను, పట్టుకోవడం వదిలిపెట్టడం మున్నగునవి వ్యానము చేతను, శరీరాన్ని పైకి లేపటం మొ॥నవి ఉదానము చేతను, శరీర పోషణాదికర్మలు సమానవాయువు చేతను కలుగుచున్నవి. త్రేనుపులు మొదలగునవి నాగవాయువుచే, కండ్లు మూసుకొనుట తెరచుకొనుట మొ॥నవి కూర్మముచే, ఆకలి కృకలముచే, నిద్ర-మగత దేవదత్తముచే, శరీరవాపు మున్నగునవి ధనంజయవాయువుచే కలుగుచున్నవి.

సంక్షిప్తముగా చెప్పబడిన పై కార్యములను మరికొంత వివరిస్తూ వ్యాఖ్యానములు చేసిరి. అవి ఏవి యనగా -

1) ప్రాణవాయువు : ఇది ఉచ్ఛ్వాస నిఃశ్వాసములు చేయుట నోరు నాసికలందు గతిని కలిగించుట, తీసుకున్న ఆహార పానీయములను పచనముచేసి పోషకాలను విభజించుట, మిగిలిన పిప్పిని మలముగాను, నీటిని మూత్ర స్వేదములుగాను, మార్చి బయటకు పంపుట, పోషక రసము (Lymph) ను రక్తములో కలిపి మాంసమేదో అస్థిమజ్జా శుక్ర ధాతువులుగా మార్చుట అను ప్రధాన కార్యములను చేస్తుంది. ఇది హృదయమునకుపైగా నుండు శరీరావయవములందు వ్యాపించియుండి యింద్రియ వ్యాపారములను నడిపిస్తుంది. మిగిలిన వాయువులకు రాజుగా ఉంటుంది. అందుచే దీనిని సంక్షిప్తంగా ప్రకర్షేణ ఆనయతి, ప్రకర్షేణ వా బలం దదాతి ఆకర్షతి శక్తిమితి ప్రాణః బయటనుండి శ్వాసను ఆహార పానీయాలను ఆకర్షించి (స్వీకరించి) జీర్ణించి సమస్త దేహానికి అందించి విశేష బలాన్ని, జీవనశక్తిని యిచ్చేది

ణమని నిర్వచించారు.

దీని ప్రభావం మెదడుపైన తద్వారా మనస్సుపైన ఉంటుంది. ఇది సక్రమముగా ఉంటే ఉత్సాహంగా, ప్రసన్నంగా, నిర్భయంగా ఉండగలుగుతాము. సక్రమముగా లేకున్న దిగులుగా, భయంగా, ఆందోళనగా ఉంటుంది. మానసిక వత్తిడి, నిద్రపట్టకపోవడం, మానసిక వికారాలు కలగటం కూడా జరుగవచ్చు.

**అపానవాయువు :** దీని స్థానం బొడ్డుకు క్రింది భాగం. ముఖ్యంగా పెద్ద ప్రేగులు. ఇది సరిగా లేకుంటే మలబద్ధకము, లేదా విరేచనాలు, కడుపునొప్పి, ప్రేగుల వాపు మొదలగునవి కలుగుతాయి. మూత్రకోశ, గర్భకోశ, వీర్యకోశ బాధలు ఇబ్బందులు కలుగవచ్చు.

సమాన **వాయువు :** దీని స్థానం కడుపు చిన్నప్రేగులు ఇది జీర్ణమైన ఆహారసారాన్ని (లింఫ్‌ను) శరీరావయవములన్నిటికి పంపుతుంది.

**ఉదానవాయువు :** దీని స్థానం ఊపిరితిత్తులనుండి గొంతు, శిరస్సువరకు. ఇది వక్రించినచో మాటలాడుటలో ఇబ్బందులు, దగ్గు, ఆయాసం కలుగుతాయి. దీనివల్లనే ఆలోచనాశక్తి, జ్ఞాపకశక్తి కలుగునని కొందరందురు.

మరణ సమయంలో జీవుడు ఈ వాయువుచేతనే శరీరం నుండి బయటకు వెళ్లి తన కర్మలకు తగిన మరొక గర్భములో ప్రవేశించునని తత్త్వవేత్తలు చెప్పుదురు. ఈ వాయువును తన వశంలో నుంచుకోగల యోగికి కొన్ని సిద్ధులు కలుగునని యోగదర్శనం (3-39) చెబుతుంది.

**ఉదాన జయాజ్జల పంక కంటకాది ష్వసంగః**
**ఉత్క్రాంతి శ్చ (యోగదర్శనం 3-39)**

ఉదానవాయువును జయించుటచే నీరు, బురద, ముండ్లుగల త్రోవలందును అనాయానముగా నడవగలుగును. (ఇది పరీక్షించవలసిన విషయము)

5. వ్యానవాయువు : వ్యాప్నోతి శరీరం యస్స వ్యానః' సమస్త దేహంలో వ్యాపించి ఉండేది వ్యానం.

ఈ పంచ ప్రాణాలున్నాయను విషయం వేదమూలకమే -

**కో అస్మిన్ ప్రాణమవయత్, కో అపానం**
**వ్యానం సమాన మస్మిన్ ।**
**కో దేవో z ధిశిశ్రాయ పూరుషే ॥ (అథర్వ. 10-2-13)**

ఎవడు ఈ దేహమునందు ప్రాణాపాన వ్యానములను పడుగుపేకలవలె నేసెను (ఏర్పరచెను) ? సమాన వాయువునకు ఎవడు ఆశ్రయమిచ్చెను? (ఉదానవాయువు గురించి వేరొక చోట చెప్పబడినది) ఇది నాడీ, రక్త సంచార కోశముల ద్వారా శరీరమంతట వ్యాపించి ఉంటుంది. ఇది వక్రించిన గుండె వ్యాధులు, రక్తపోటు, రక్తప్రసరణలో ఇబ్బందులు కలుగును. స్పర్శశక్తికూడా తగ్గును.

మిగిలిన ఉపప్రాణముల పనులు సీమితమే కనుక వివరించనవసరంలేదు.

ఆయుర్వేదంలో వీటినే ప్రాణవాతము, అపానవాతము మున్నగు పేర్లతో పిలుస్తారు. మన శరీరం పార్థివం(ఆహారం)తో నిర్మించ బడింది. అట్టి దీనిని వాత పిత్త శ్లేష్మాలు (వాయు, అగ్ని, జలాలు) నడిపిస్తున్నాయి. వీటిలోను వాతమే (వాయువే) ప్రధానంగా ఉంటుంది. దానినే మనం ప్రాణం (ప్రాణశక్తి) అంటున్నాము. ఇది కేవలం మనను జీవింపజేయుటయే కాక, వ్యాధులను నశింపజేసి

బలోత్సాహాలను కలిగిస్తుంది. మానసిక ప్రశాంతత నిస్తుంది. దానికి ఉపాయం ప్రాణాయామ సాధన.

## ప్రాణాయామ పద్ధతులు - ప్రయోజనాలు

మన ప్రాచీన వైదిక సాహిత్యాన్ని పరిశీలించినట్లయితే వేదకాలం నుండి ప్రాణాయామం చేయటం లోకంలో ప్రచలితమైయున్నట్లు కనబడుతుంది. ప్రతి మానవుడు ప్రతిదినం ఉదయసాయం సంధ్యాసమయాలలో అవశ్యమాచరించవలసిన సంధ్యావందనంలో ప్రాణాయామం ఒక అంగముగా ఉన్నది. ప్రాచీన కాలంలో పిల్లలను 8వ ఏటనే గురుకులాలకు పంపేవారు. అక్కడ గురువులు ఆ పిల్లలకు ఉపనయన, వేదారంభ, సంస్కారం చేసి సంధ్యావందన ప్రాణాయామాలు నేర్పేవారు. వారు అప్పటినుండి మరణపర్యంతం సంధ్యోపాసనతోబాటు ప్రాణాయామం చేసేవారు అందువల్ల వారికి శారీరక బలారోగ్య ఉత్సాహాలేకాక మానసిక ఏకాగ్రత, విద్యాధారణశక్తి, ఇంద్రియ మనో వికారాల నివృత్తి, ప్రసన్నత కలిగేవి. జీవితమంతా ఆనందమయంగా ఉండేది.

అయితే, ప్రాచీన కాలంలో ప్రాణాయామం ఏవిధంగా చేసేవారో, ఏఏ పద్ధతులు ఉండేవో స్పష్టంగా తెలియదు. యోగదర్శనకర్తయైన పతంజలి మహర్షి కాలం (మూడువేల సంవత్సరముల పూర్వము) నాటికి 4 రకాల ప్రాణాయామ పద్ధతులు ఉండేవని ఊహించవచ్చును. ఆ మహర్షి తన యోగదర్శనంలోని మొదటి పాదంలో మనో ఏకాగ్రతకు కొన్ని ఉపాయాలు చెబుతూ ప్రాణాయామం ఒక సాధనంగా పేర్కొన్నాడు. ఆ విధానం ఏమిటో ఈవిధంగా వివరిస్తారు.

ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా ప్రాణస్య ।

**(యోగ దర్శనం 1-34)**

ఈ సూత్రమునకు వ్యాసమహర్షి ఈ విధంగా భాష్యం వ్రాసారు.

(ప్రచ్ఛర్దన) కోష్ఠకస్య వాయోర్నాసికాపుటాభ్యాం ప్రయత్న విశేషాద్వమనం, (విధారణ) విధారణం ప్రాణాయామస్తాభ్యాం వా మనసః స్థితిం సంపాదయేత్ ॥

శ్వాసకోశమునందలి వాయువును రెండు నాసికా పుటముల ద్వారా వేగముగ బయటకు వెడలగ్రక్కుటను ప్రచ్ఛర్దన మంటారు.

విధారణ మనగా వాయువును బయటకు తీసి వెంటనే నాసికాపుటముల ద్వారా లోనికి ప్రవేశింపనీయకుండ సుఖముగా ఆపగలిగినంత సమయము బయటనే నిలిపియుంచుట దీనినే ప్రాణాయామం అంటారు. ఈ రకమైన అభ్యాసం వల్ల కూడా చంచలముగానుండు మనస్సు స్థిరమగును.

రెండవదైన సాధన పాదంలో ఈ ప్రాణాయామ పద్ధతులు నాలుగు ఉన్నట్లు చెబుతారు. ముందుగా ప్రాణాయామానికి ఒక విశిష్ట లక్షణం చెబుతారు.

**తస్మిన్ సతి శ్వాస ప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః**

**(యోగదర్శనం 2-49)**

స్థిరముగా సుఖముగా చాలా సమయం కూర్చుండగల ఆసనము సిద్ధించిన తదుపరి శ్వాసప్రశ్వాసముల స్వాభావికగతిని అడ్డగించుటయే ప్రాణాయామ మనబడును.

**బాహ్యాభ్యంతర స్తంభవృత్తి ర్దేశకాల సంఖ్యాభిః**

**పరిదృష్టో దీర్ఘ సూక్ష్మః ( యోగదర్శనం 2-50)**

బాహ్య, అభ్యంతర, స్తంభవృత్తి అని మూడు రకముల

ప్రాణాయామములుండును.

ఇవే దేశ, కాల, సంఖ్యలచే, దీర్ఘముగాను, సూక్ష్మముగాను ఉండును.

బాహ్యాభ్యంతర విషయాక్షేపీ చతుర్థః (2-51)

నాల్గవది బాహ్యాభ్యంతర విషయాక్షేపి. ఈ నాలుగు రకాల ప్రాణాయామాల గురించి మహర్షి దయానందుడు తన ఋగ్వేదాది భాష్యభూమిక ఉపాసనా విషయ ప్రకరణంలో ఈ క్రింది విధంగా వివరించారు. అయితే, ఉచ్ఛ్వాస నిశ్వాసముల విధానము మొదటి సూత్రంలో (యో. ద. 1-34)లో చెప్పినట్లే అని మరువరాదు. కేవలం కుంభక విషయంలోనే 4 పద్ధతులు.

ఉపాసనకు నాల్గవ అంగము ప్రాణాయామము వెలుపలి నుండి శరీరము లోనికి గ్రహింపబడు వాయువు శ్వాసము, శరీరము నుండి బయటికి బోవు వాయువు ప్రశ్వాసము. ఆసనము సిద్ధించిన మీదట నీశ్వాస ప్రశ్వాసముల గమనాగమనములను అభ్యాసము మూలమున నెమ్మది నెమ్మదిగ నడ్డగింపవలెను. చేతి వ్రేళ్ళతో నాసికను పట్టుకొనరాదు. కాని జ్ఞానపూర్వకముగనే శ్వాసప్రశ్వాసముల గతిని నిరోధించుట - ప్రాణాయామమనబడును.

ఈ ప్రాణాయామయము నాలుగు విధములు

1. బాహ్యవిషయము 2. అభ్యంతర విషయము

3. స్తంభవృత్తి 4. లోపల వెలుపల వాయువును నిలుపుట వలన గులుగునది.

లోపలినుండి వెలుపలికి వచ్చిన వాయువును మరల లోపలికి బోకుండునట్లు వెలుపలనే దాని నిలుపుట మొదటి ప్రాణాయామము.

వెలుపలి వాయువును లోపలికి తీసికొని దాని నెంతసేపు లోపల నిలుపగలుగుదురో అంత తడవు నిలుపుట రెండవరకరపు ప్రాణాయామము.

ప్రాణమును వెలుపలికి గాని, వెలుపలి వాయువును లోపలికి గాని పోనీయక ఎక్కడి వాయువు నక్కడే నిలుపుట స్తంభవృత్తి ప్రాణాయామ మనబడును.

నాల్గవ రకపు ప్రాణాయామమున లోపలి వాయువు వెలుపలికి రా యత్నించునపుడు వెలుపలినుండి అడ్డగించుచు దానిని లోపలనే యుండునట్లు ప్రయత్నింపవలెను. అట్లే వెలుపలి వాయువు లోపలికి బోవనున్నపుడు దానిని లోపలికి రానీయకుండ లోపలినుండియే అడ్డగించుచుండవలెను. వెలుపలి వాయువును వెలుపలికి నెట్ట ప్రయత్నింపవలెను.

మూడవరకపు (స్తంభవృత్తి ప్రాణాయామమునకు నాలుగవ రకపు ప్రాణాయామమునకుగల భేదమేమియన

మూడవ ప్రాణాయామము బాహ్యాభ్యంతర ప్రాణాయామాభ్యాసము నపేక్షింపదు. నాల్గవరకపు ప్రాణాయామ మాభ్యంతర బాహ్యవిషయక ప్రాణాయామాభ్యాసము నపేక్షించును. ఇట్టి నాల్గువిధములైన ప్రాణాయామముల ననుష్ఠించుటవలన చిత్తము నిర్మలమై ఉపాసనలో స్థిరత ఏర్పడును.

పై వివరణ సంక్షిప్తమైనదే. వాటిని అభ్యసింపగోరువారు అట్టి యోగసాధనచేయువారి సమ్ముఖమున నేర్చుకొనుట మంచిది. పై పద్ధతులు శారీరక ఆరోగ్యాన్ని కలిగించుటతోబాటు మనోచాంచల్యాన్ని తగ్గిస్తాయి. సామాన్యంగా మన అశాంతికి, అనారోగ్యానికి మన

మనస్సులోని, ఇంద్రియాలలోని వికారాలే కారణం. ( ఈవిషయాన్ని వివరంగా తెలిసికోదలచినవారు మాచే ప్రచురింపబడిన వేదాలలో జలచికిత్స, వేదాలలో సూర్యకిరణ చికిత్స అనే గ్రంథాలు చదువగోరెదము) ప్రాణాయామం వల్ల చాలావరకు ఈ దోషాలు ఉపశమిస్తాయి. అందుచేతనే మహర్షి మనువు -

శ్లో॥ **దహ్యంతే ధ్మాయమానానాం ధాతూనాం హి యథా మలాః ।**
**తథేన్ద్రియాణాం దహ్యన్తే దోషాః ప్రాణస్య నిగ్రహాత్ ॥**

(మను. 6-71)

అగ్నిలో కాల్చిన ధాతువు (లోహము)లలోని మలినాలన్నీ నష్టమై పోవునట్లే ప్రాణాలను నిగ్రహించటం (ప్రాణాయామం) వలన మనస్సు మున్నగు ఇంద్రియాలలోని దోషాలన్నీ భస్మమమై అవి నిర్మలంగా ఆరోగ్యంగా ఉంటాయి. అన్నారు

అందుకే అనుభవం కల విద్వాంసులిలా అన్నారు.

శ్లో ॥ **ప్రాణాత్ పుష్టిర్హి గాత్ర, బుద్ధిస్తేజోయశోబలమ్ ।**
**ప్రవర్ధంతే నరస్యేతి, ప్రాణాయామం సమాచరేత్ ॥**

ప్రాణంతో శరీరం పుష్టిగా ఉంటుంది. బుద్ధి, తేజస్సు, యశస్సు, బలం వృద్ధి చెందుతాయి. కనుక మానవులు నియమానుసారంగా ప్రాణాయామాన్నభ్యసించాలి. యోగ్యులైన గురువుల వద్ద బాగా అభ్యసించిన తరువాతనే ప్రాణాయామాన్ని నిత్యం చేయాలి. లేకుంటే ప్రాణాయామం సరిగా చేయనిచో హానిజరిగే అవకాశం ఉంది. పై నాలుగు పద్ధతులు ప్రాచీనమైనవి. కాని, నేడు లోకంలో

అనేక రకాల ప్రాణాయామ పద్ధతులు ప్రచారంలో ఉన్నాయి. వాటిలో హఠయోగ ప్రదీపిక' ప్రతిపాదించు 8 రకాల ప్రాణాయామ పద్ధతులు ముఖ్యమైనవి. అవి ఏవి యనగా -

శ్లో॥ సూర్యభేదన ముజ్జాయీ సీత్కారీ శీతలీ తథా ।
భస్త్రికా భ్రామరీ మూర్ఛా ప్లావనీత్యష్ట కుమ్భకాః ॥
(ద్వితీయోపదేశం -44)

భా.అ. సూర్యభేదనము, ఉజ్జాయీ, సీత్కారీ, శీతలీ, భస్త్రికా, భ్రామరీ, మూర్ఛా, ప్లావనీ అనునవి 8 రకముల ప్రాణాయామములు.

వీటన్నిటిని యిక్కడ వివరించుటకు వీలుపడదు. కేవలం వీటివల్ల కలుగు ప్రయోజనాలను సంక్షిప్తంగా వ్రాయుచున్నాము. వాటిలో మీమీ అభిరుచులను, అవసరాలను బట్టి ఆయా పద్ధతులు ఎన్నుకొని మీకు సమీపములోగల అనుభవజ్ఞులైన యోగాసన ప్రశిక్షకుల ద్వారా నేర్చుకోగోరుచున్నాము.

ప్రయోజనాలు : -

1. సూర్యభేదనము : దీనివలన నాడీ మండలము బలపడి వాత దోషములు నివారింపబడును. జీర్ణశక్తి వృద్ధిచెందును. కుష్ఠవ్యాధి, సుఖవ్యాధులు పోవును. ఇంద్రియములు బలపడును. కపాల శుద్ధి, ఆయుర్వృద్ధి జరుగును.

2. ఉజ్జాయీ : కంఠమునందుగల కఫాది శ్లేష్మ రోగములు హరించును. జఠరాగ్ని వృద్ధిచెందును. జలోదరమును, నాడుల యందలి దోషములును పోవును.

3. సీత్కారీ : దీనివలన దుష్టమైన ఆకలి దప్పికలు, నిద్రాలస్యములు ఉపశమించును.

శీతలీ : ఇది వ్రణములను, ప్లీహవ్యాధులను, పిత్తవికారములను, జ్వరములను పోగొట్టును. దుష్టఆకలి దప్పికలు విషము ఉపశమించును.

5. భస్త్రిక : ఇది వాత, పిత్త, శ్లేష్మములను పోగొట్టి, జఠరాగ్నిని వృద్ధి చేయును. ఊపిరితిత్తులకు, గొంతుకకు, ఛాతికి సంబంధించిన జబ్బులను నశింపజేయును. మలబద్ధకమును, వాయువును, అతిమూత్ర వ్యాధిని పోగొట్టును.

6. భ్రామరి : దీనివలన మానసిక ఆందోళన, రక్తపోటు తగ్గును. గాయకులకు గాత్రము చక్కబడును.

7. మూర్ఛా : దీనివవలన మూర్ఛవంటి స్థితి కలిగి మనస్సు ఏకాగ్రమగునని చెప్పుదురు.

8. ప్లావని : దీనిలో ఉదరము వాయువుతో పూరింపబడుటవలన నీటిలో తేలవచ్చునని చెప్పుదురు.

పై ఫలితాలు హఠయోగ ప్రదీపిక లో చెప్పబడినవి. వీటిపై పరిశోధనలు జరుగుచున్నవి. కొన్ని మంచి ఫలితములు కలుగు చున్నట్లు చెప్పుచున్నారు. ముఖ్యంగా భస్త్రికా ప్రాణాయామంవల్ల ఉబ్బసరోగులకు, ఉజ్జాయీ వలన క్షయరోగులకు ఉపశమనం కలగటం గుర్తింపబడింది. సూర్యభేదనప్రాణాయామం అందరు ఆచరించదగినదని చెప్పుచున్నారు. ఏమైనను ఇవి ఆయా బాధలలో తాత్కాలిక ఉపశమనం కొరకు ఉపయోగపడేవేకాని నిత్యమాచరించ దగినవి కావు. హఠయోగప్రదీపిక ఋషులు వ్రాసిన గ్రంథం కాదు. తాంత్రిక గ్రంథాల అనంతరం ఎవరో విద్వాంసులు వ్రాసినవి. అందలి ఎన్నో విషయాలు వేదశాస్త్రాలకు భిన్నంగా ఉన్నాయి. కనుక,

ముందుగా వివరించిన మహర్షి పతంజలి ప్రదర్శిత ప్రాచీన పద్ధతే శ్రేష్ఠం. వీటిని ప్రాణాయామం అనేకన్న ప్రాణవ్యాయామం అనటం సమంజసం.

ఏ ప్రాణాయామమైనా యోగ్యులైన అనుభవ ప్రశిక్షకులద్వారా నేర్చుకొనుట మంచిది. లేకున్న సత్ఫలితాలు కలుగకపోగా దుష్ఫలితాలు కలుగవచ్చు. కొందరు ఆ విధంగా బాధపడిన వారున్నారు. మంచిదికదా! అని గంటల తరబడి ప్రాణాయామం చెయ్యనక్కరలేదు. ప్రతిరోజు ఉదయ సాయం కాలాలలో 3 నుండి 21 పర్యాయాలు వారి శక్తి ననుసరించి చేస్తే సరిపోతుంది. అందులోను మనవంటి సామాన్యులు ప్రచ్ఛర్ధన పూర్వక బాహ్యాభ్యంతర కుంభకాలు రెండును ఆచరించుట మంచిది. ఏలన ఎప్పుడైతే మనం ప్రయత్నపూర్వకంగా లోపలిగాలిని తీసివేస్తామో అప్పుడు లోపలి వాయుగోళాలన్నీ ముడుచుకుపోతాయి. ప్రతిచర్యగా (Secondary action) వాయుగోళాలు ఎక్కువగా వికసిస్తాయి. ఆర్తిక (కాళీ) ప్రదేశాన్ని ఆక్రమించుకోవడానికి గాలి తనంతతానుగా ప్రయత్నిస్తుంది. దానితో మనకు ప్రాణవాయువు (ఆక్సిజన్)ఎక్కువగా లభిస్తుంది. దానితోబాటు ఊపిరి నిలిచిపోగానే చంచలంగా ఉన్న మనస్సు నిశ్చలం అవుతుంది. ధారణా ధ్యానములు చేయగల సామర్థ్యం వస్తుంది. అందుచే ఆరోగ్యపరంగాను, ఆధ్యాత్మికపరంగాను ప్రాచీన ఋషులు సూచించిన ప్రాణాయామములే ఉత్తమం.

## ప్రాణయామం సంపూర్ణ వ్యాయామం

ఇతర యోగాసనాది వ్యాయామములు చేయలేనివారు, చేయు సమయము లేనివారు ఒక్క ప్రాణాయామం చేసినప్పటికి వ్యాయామ ఫలితాలు వస్తాయి. ఎట్లన వ్యాయామం యొక్క ముఖ్యఉద్దేశ్యం

శరంలోని అన్ని అవయవాలకు మంచి రక్తం సాఫీగా ప్రవహించి, ందలి చెడు రక్తము బహిష్కారావయవాలైన శ్వాసముల మూత్ర స్వేద అవయవాలకు చేరుటయే. ప్రాణాయామం వల్ల ఛాతీయందలి ప్రధానావయవాలైన గుండె, ఊపిరితిత్తులకు వ్యాయామం జరుగుటయేగాక రక్తము ఎక్కువ ప్రాణవాయువు (ఆక్సిజన్) ను గ్రహించగలుగుతుంది. దీనితోబాటు రక్తప్రసార వేగం కూడ పెరుగుతుంది. ఉచ్ఛ్వాస నిశ్వాస ప్రక్రియవల్ల కడుపుకు చక్కటి వ్యాయామం జరిగి అందలి జీర్ణ మల, మూత్రావయవాలకు చక్కటి రక్తప్రసరణ జరుగుతుంది. ఇంతేగాక తల, కాళ్ళు, చేతులలోనికి, చక్కటి రక్తప్రసారం జరిగి సంపూర్ణ వ్యాయామం అవుతుంది. కొంత వేడి పుట్టి చిరుచెమట పడుతుంది.

ఈ విధంగా బహిష్కారావయవాలైన మల మూత్ర శ్వాస కోశాలతోబాటు చర్మంకూడా శక్తివంతమౌతుంది.

ఈ ప్రాణాయామ వ్యాయామం ఆరోగ్యాన్ని కలిగించుటయేకాక దీర్ఘాయువును కలిగిస్తుంది. వేరే వ్యాయామాలలో శ్వాసలు ఎక్కువగా ఖర్చయ్యి ఆయుర్దాయం తగ్గుతుంది. శ్వాసలను బట్టి ఆయుర్దాయం ఉంటుందనడానికి సృష్టిలో మనకు కొన్ని నిదర్శనాలు కనబడుతున్నాయి. వివిధ ప్రాణిజాతుల ఆయుర్దాయం వాటి సామాన్య శ్వాసల సంఖ్య పరిశీలిస్తే ఈ విషయం అవగతమౌతుంది.

| ప్రాణిజాతి | శ్వాసల సంఖ్య నిముషానికి | ఆయుర్దాయం సం॥రాలలో |
|---|---|---|
| కుందేలు | 38 | 8 |
| పావురం | 36 | 8 |
| కోతి | 32 | 11 |
| కుక్క | 29 | 14 |

| | | |
|---|---|---|
| మేక | 24 | 16 |
| మనిషి | 15 నుండి 18 | 100 |
| ఏనుగు | 12 | 110 |
| పాము | 8 | 120 |
| తాబేలు | 5 | 150 |

పై పట్టికనుబట్టి శ్వాసల సంఖ్య తగ్గిన కొలది ఆయుష్షు పొడిగింపబడుతుందని తెలుస్తుంది. అందుచేతనే మన ఋషులు నిత్యకర్మయైన సంధ్యావందనంలో దీనిని ఒక అంగముగా చేర్చి, కొన్ని మంత్రాలు, నిర్దేశించారు. ప్రతి మనిషి కనీసం ఉదయం 3 పర్యాయాలు సాయంత్రం 3 పర్యాయాలు ప్రాణాయామం చెయ్యాలనే నియమం ఏర్పాటు చేసారు.

**ప్రాణాయామ మంత్రాలు వాటి అర్థాలు :** ఇవి వేదమంత్రాలు కాదు కాని పరమేశ్వరుని దివ్యగుణాలను తెలిపే అద్భుత పదములు - నామములు అవి ఏవి యనగా -

ఓం భూః = ఉనికి (Existence) గల సర్వవ్యాపకమైన సత్ స్వరూపుడు
ఓం భువః = అనంత జ్ఞానసామర్థ్యములుగల చిత్ స్వరూపుడు
ఓం స్వః = దుఃఖమిశ్రితము కాని కేవల ఆనంద స్వరూపుడు
ఓం మహః = అన్నిటికన్న గొప్పవాడు. మహత్ పరిమాణము గలవాడు
ఓం జనః=సర్వలోక లోకాంతరములకు, అందలి ప్రాణులకు జనకుడు
ఓం తపః=సృష్టి పాలనా తపస్వి
ఓం సత్యమ్ = సత్ పదార్థములైనజీవ ప్రకృతుల కంటె గొప్పవాడు త్రికాలములందును మార్పు చెందని సత్యస్వరూపుడు.

పైవి సంక్షిప్తార్థాలు మాత్రమే. వీటి అర్థాలు వివరంగా తెలి... గోరువారు తైత్తరీయోపనిషతులోను మరియు మహర్షి దయాన...

విరచిత సత్యార్థ ప్రకాశం మొదటి సముల్లాసములలోను చూడగోరు చున్నాము. ఇక అన్ని నామముల ముందు ఉన్న 'ఓం' పదము చాలా విశాల మైన అర్థము కలది. అందుచేతనే యిది పరమేశ్వరుని ముఖ్యనామము. స్వనామము (స్వంతపేరు). మిగిలిన నామము లన్నియు అతని గుణకర్మ స్వభావాలను, శక్తులను తెలిపేవి.

ఓం యొక్క ముఖ్యమైన అర్థము సర్వసంరక్షకుడు అని. అదే జీవులమైన మనకు, పరమేశ్వరునకు గల సంబంధము. అతడు మనకు సదా సంరక్షకుడు, మనము సదా అతనిచే రక్షింపబడుచుండు రక్షితులము.

పై మంత్రాలలోని మొదటి మూడు మంత్రాలు పరమేశ్వరుని సూచించుటతో బాటు మన శరీరంలోని మూడు ప్రధాన ప్రాణాలను సూచిస్తాయి. అవి ఏవి యనగా -

**భూః ఇతి వై ప్రాణః** = భూః అనగా ప్రాణవాయువు

**భువః ఇతి అపానః** = భువః అనగా అపానవాయువు

**స్వర్ ఇతి వ్యానః** = స్వః అనగా వ్యానవాయువు

ముఖ్యంగా ఈ మూడు వాయువులే మన శరీరవ్యాపారాలను నడిపిస్తాయి. ఈ ప్రాణాయామం వల్ల నాలోని ప్రాణాపాన వ్యానములు బలపడాలనే సంకల్పం కూడా వీటిలో ఇమిడి ఉంటుంది. వీటినే మన శాస్త్రాలలో మహావ్యాహృతులని చెప్పబడింది. అంటే ఇవి విశాల మైన అర్థాలుగల గొప్ప పదములని అర్థం.

పై మంత్రాలను కుంభకసమయంలో మననునందే స్మరించాలి. వ్యర్థమైన ఆలోచనలతో ప్రాణాయామం చేయటంకన్న పరమేశ్వరుని దివ్యగుణాలు స్మరిస్తూ చేయటం ఉత్తమం. ఏలన ప్రాణాపానములు ఆరోగ్యమును కలిగించు అశ్వినీదేవతలే అయినప్పటికి రోగనివారణచేయు అశ్వినీదేవత పరమేశ్వరుడే.

అట్టి పరమేశ్వరుడు ప్రబోధించిన వేదంలో వాయు ప్రశంసచేసే మంత్రాలు అనేకం. ఉదాహరణకు ఋగ్వేద దశమ మండలంలోని 3 మంత్రాలుగల ఈ చిన్న వాయుసూక్తాన్ని పరిశీలించండి.

**వాత ఆ వాత భేషజం శంభు మయోభు నో హృదే**
**ప్ర ణ ఆయూంషి తారిషత్ ॥ (ఋ. 10-186-1)**

భావార్థము : వాయువు మా హృదయ (ఊపిరితిత్తుల) ఆరోగ్యముకొరకు కల్యాణకర ఓషధిని తీసుకువచ్చును. అది మా ఆయువును పెంచును. అందుచే

**ఉత వాత పితాసి న ఉత భ్రాతోత నః సఖా ।**
**స నో జీవాతవే కృధి॥ (ఋ. 10-186-2)**

భా.అ. ఆ వాయువు మమ్ము పితవలె పాలించేది. బంధువు వలె భరణపోషణలు చేసేది. మిత్రునివలె మేలు చేసేది. అందుచే అది మా జీవన హేతువు.

**యదదో వాత తే గృహే 3 (అ)మృతస్య నిధిర్హితః ।**
**తతో నో దేహి జీవసే ॥ (ఋ. 10-186-3)**

సర్వసద్గుణరాశివైన ఓ వాయువా ! నీ గృహమైన అంతరిక్షములో సృష్టికర్తయైన పరమేశ్వరుడు అమరత్వనిధివైన నిన్నుంచి మాకు జీవితమును ప్రసాదించినాడు. అట్టి పరమేశ్వరునకు మా నమస్సులు.

ఈ విధంగా వాయు ప్రశంసచేసే మంత్రాలు వేదాలలో వేలకొలది ఉన్నాయి. అన్నిటిని పేర్కొనటం అసాధ్యమే. ఇక మనం అట్టి వాయువును, దానిని మనం గ్రహించగల ప్రాణాపాన వ్యవస్థను సృజించిన పరమేశ్వరాశ్వినీదేవత గురించి తెలిసికొందము రండు.

# భిషజానామ్ భిషక్ పతిః పరమేశ్వరః

భిషక్కులందరికి **పతి భిషక్ పతి** పరమేశ్వరు డని పై సంస్కృత వాక్యానికి అర్థం. **భిషతి చికిత్సతే ఇతి భిషక్** అని నిర్వచనం. అనగా రోగమునకు ప్రతీకారమనదగు చికిత్సాకర్మల జేయువాడు భిషక్ - వైద్యుడు. వేదాలలో పెక్కుచోట్ల వైద్యుని **భిషక్** అనే పదంతో పేర్కొనటం కనబడుతుంది. అట్లే ఆయుర్వేదమునందును గలదు. అయితే, పరమేశ్వరుడు వైద్యరాజెట్లగునని సందేహమా! అతడు వైద్యరాజేకాదు ప్రప్రథమ వైద్యుడు కూడా ఎట్లన -

నేడు లోకంలో వైద్యవిద్య నభ్యసించటానికి అనేక అవకాశాలున్నాయి. ఎందరో గురువులు లభింతురు. కాని సృష్ట్యాదిలో ప్రథమ మానవసృష్టి సమయంలో మానవులకు చికిత్సాశాస్త్రము నుపదేశించిన దెవరు ? అని ఆలోచించిన సృష్టికర్తయైన పరమేశ్వరుడే అని అంగీకరించక తప్పదు. ప్రాథమిక జ్ఞానం లేనిది జ్ఞానవికాసం కలుగదని పూర్వ ప్రకరణంలో తెలిసికొన్నాము కదా! అందుచే పరమేశ్వరుడే ప్రప్రథమ వైద్యుడు. అతడే ప్రప్రథమ వైద్యగురువు.

నేడు లోకంలో ఒకరిని మించిన వైద్యులొకరున్నారు. ఎవడైనా ఒకడు నేడు ప్రపంచంలోనే సర్వోన్నత వైద్యుడని కీర్తింపబడినా, కాలాంతరంలో మరొకడు గొప్పవైద్యుడు కావచ్చును. అతని ముందు మొదటి వ్యక్తి తక్కువే కావచ్చును. మొదటి వ్యక్తిలో కొన్ని లోపాలు, తప్పులు కనబడవచ్చును. కనుక ఏ వ్యక్తినీ సర్వజ్ఞుడని చెప్పటకు వీలు లేదు. కనుక పరమేశ్వరుడే సర్వజ్ఞుడైన భిషక్. కాలమునకు కట్టుబడనివాడు కనుక త్రికాలములందును (అప్పటికి, ఇప్పటికి, ఎప్పటికిని) అతడు భిషక్ పతియే. అందుచేతనే వేదము ఈ విధంగా కీర్తిస్తుంది.

ఉన్నో వీరా అర్పయ భేషజేభిర్భిషక్తమం
త్వాం భిషజాం శృణోమి ॥ (ఋ. 2-33-4)

ఓ ఇంద్ర! పరమేశ్వర! వైద్యుల సమూహములో నిన్ను వైద్య శిరోమణివని వినియుంటిమి. కనుక దయచేసి మా వీరుల (పుత్ర పౌత్రాదుల, పౌరుల) వ్యాధులను, బాధలను తొలగించి వారికి బలా రోగ్య పరాక్రమాదులతో కూడిన ఉత్తమ ఆరోగ్యమును ప్రసాదింపుము.

**అధ్యవోచ దధివక్తా ప్రథమో దైవ్యో భిషక్ ॥**
**అహీంశ్చ సర్వాఞ్జమ్భయ న్త్సర్వాశ్చ**
**యాతుధాన్యో z ధరాచీః పరాసువ ॥ (యజు. 16-5)**

హే పరమేశ్వర! నీవు రోగముల పాలిట రుద్రుడవు. సృష్ట్యాదిలో వేదముల ద్వారా సర్వోత్తమ వైద్యశాస్త్రము నుపదేశించిన ఆది వైద్యగురుడవు. సర్పమువలె ప్రాణుల బాధించు సర్వరోగములను బాపగల దివ్యవైద్యుడవు. కనుక కృపతో మా శారీరక మానసిక ఆత్మిక రోగముల నన్నిటిని పారద్రోలి రక్షించుము . తిరిగి రోగముల పాలిట బడకుండ రోగకారకములైన దుర్భావ, దుర్వ్యసన, దుష్టచేష్టలనుండి మమ్ము దూరమొనర్చుము. అంతర్యామివై అట్లు మమ్ము ప్రేరేపింపుము.

ఇంతేగాక, అనేక మంత్రాలలో పరమేశ్వరుడు భిషక్ (వైద్యుడు) అనే మాటలు కనబడతాయి. అవి ఔషధాలను (మూలికలను) సృష్టించినవాడు పరమేశ్వరుడే అని వర్ణిస్తాయి.

1) **అగ్నే త్వమ్ భిషక్ భేషజస్యాపికర్తా (అథర్వ. 5-29-1)**

ఓ అగ్నీ! ప్రకాశస్వరూప పరమేశ్వర! నీవు వైద్యుడవు. భేషజ (ఔషధ) కర్తవును నీవే.

2) క్వస్య తే రుద్ర మృతయా కురు హస్తో
యో అస్తి భేషజో జలాసః ॥ (ఋ. 2-33-7)

ఓ రుద్ర ! రోగములపాలిట రుద్రుడా! దివ్యమైన ఆరోగ్య సుఖము నిచ్చు నీ ఔషధరూప కరములు (చేతులు) ఎక్కడ నున్నవి.

(పరమేశ్వరునకు చేతులుండవు. అతడు సృజించిన ఔషధములే అతని సుఖకారక చేతులని అలంకారిక వర్ణన)

3) **ఇంద్రం దేవం భిషజమ్ (యజు. 28-29)**
భిషక్కైన ఆ ఇంద్ర దేవుని స్మరింపుము

4) **వరుణో భిషక్ (యజు. 21-58)**

5) **వరుణం భిషజాం పతిమ్ (యజు. 21-40)**

6) **సరస్వతీ భిషక్ (యజు. 21-30)**

7) **మరుత్ యావో భేషజా మరుతః శుచీని: (ఋ.2-33-13)**

పై వేద మంత్రాలలోని, వాక్యాలలోని అగ్ని, రుద్ర, ఇంద్ర, వరుణ, సరస్వతీ మొదలగు పేర్లన్నీ ఒకే సర్వవ్యాపక పరమేశ్వరునికి వర్తించేవే. ఒక్కొక్క పదము ఈశ్వరుని ఒక్కొక్క గుణాన్ని తెలుపుతుంది. ఇందుకు ప్రమాణం వేదమే.

**ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహురథో**
**దివ్యస్స సుపర్ణో గరుత్మాన్**
**ఏకం సద్విప్రా బహూధా వదంత్యగ్నిం యమం**
**మాతరిశ్వాన మాహుః ॥** (ఋ. 1-164-46)

పై వేదమంత్రం ఒకే పరమేశ్వరుని విప్రులు (విద్వాంసులు) వివిధ నామములతో వర్ణిస్తారని చెబుతున్నది. కనుక ముందు మంత్రాలలోని వివిధ నామములతో భిషక్‌గా వర్ణింపబడినది

పరమేశ్వరుడే. అతడు సర్వవ్యాపకుడు కనుక సర్వప్రాణులందును వ్యాపించి యుండి ఆయా ప్రాణుల శరీర వ్యాపారాలను సక్రమంగా నడిపిస్తున్నాడు. లేకున్న జడపదార్థాలైన ఆహార జల వాయువులకు అట్టి శక్తి ఎక్కడున్నది. ?

మనం మన శరీరాన్ని జాగ్రత్తగా పరిశీలించిన - శరీరాన్ని, నిర్మించుకున్నది మనం కాదు. మన తల్లిదండ్రులును కారు. ఏలన వారికట్టి జ్ఞానంకాని, సామర్థ్యం కాని లేదు అన్నది స్పష్టం నేటి ఆధునిక విజ్ఞానం చెప్పే జీన్స్ కారణమంటారా? అదియును కాదు. జీన్సు అని చెప్పబడే సూక్ష్మకణాలు ఒకరకమైన మాంసకృత్తు (ప్రోటీన్) పదార్థమే కదా! జ్ఞానం లేని ఆ జడపదార్థానికి శరీరాన్ని నిర్మించగల జ్ఞానం ఎక్కడనుండి వచ్చింది ?

అట్లే మన శరీరాంతర్గత వ్యాపారాలను మనం నిర్వహించటం లేదు. ఇంద్రియాలు మన స్వాధీనంలో ఉన్నా అంతర్గత శరీరవ్యాపారాలు మన చేతిలో లేవు. కనుక మన శరీరంలో మనకన్న భిన్నంగా ఒక మహత్తరశక్తి వ్యాపించియుండి ఆ యా పనులు నిర్వర్తిస్తున్నది. అయితే ఈ శరీర వ్యాపారాలు అందరిలోను సమానంగా ఉండక హెచ్చుతగ్గులుగాను, కొందరిలో లోపించి ఉండటానికి కారణం ఏమిటని కొందరడుగవచ్చును. అందుకు కారణం ఆయా జీవులు చేసిన కర్మలు. అవి ఈ జన్మలో చేసినవి కావచ్చు లేదా పూర్వజన్మల లోనివి కావచ్చు. వీటికి తోడు మన ఇంద్రియలోలత, అజ్ఞానము ప్రమాదాదులు కూడా ఉంటాయి. నేటి వైద్య శాస్త్రం చెప్పే వంశపారంపర్యము, జెనిటిక్ లోపాలు రెండవ కారణంగా ఉంటాయి. ఈ వ్యవస్థనంతా అత్యంత న్యాయ

పూర్వకంగా చేసేది సర్వవ్యాపక సర్వేశ్వరుడు. కనుక అతడు అనంత జ్ఞాన సామర్థ్యములుగల గొప్ప అశ్వినీదేవత - భిషక్పతి. సర్వవ్యాపకుడైన పరమేశ్వరుడు పై విధంగా ఒక వ్యవస్థను ఏర్పరచి నియమంగా నడిపిస్తున్నాడు. ఇట్టి వ్యవస్థనే ప్రకృతి వైద్యులు దేహప్రకృతి అంటున్నారు. హోమియోవైద్యులు వైటల్ ఫోర్స్ (Vital Force) అంటున్నారు. ఇక అల్లోపతి వైద్యులకు ఈ విషయం అర్థంకాక రెసిస్టెన్స్ అనీ, జనిటిక్ కారణాలనీ, వివిధ క్రిములనీ, విటమిన్ల లోపమనీ రకరకాలుగా చెప్పుచున్నారు. దానికి కారణం జీవులు చేసిన కర్మలని చెప్పువారు చాలా అరుదు. ఆయుర్వేద శాస్త్రం అట్లుకాక విశాలంగా సృష్ట్యుత్పత్తినుండి ప్రారంభించి వివిధ ప్రాణుల ఉత్పత్తి, వాటిలోని వ్యవస్థలు చికిత్సలు సమగ్రంగా తెలుపుతుంది. ఈ విషయం మిచట వివరముగా వ్రాయుటకు వీలుపడదు. తెలిసికోగోరువారు మా ప్రచురణ **వేదాలలో జల చికిత్సా విజ్ఞానము** లోని **రోగమేల కలుగును ?** అనే ప్రకరణం చదువగోరుచున్నాము. ఏ రకంగా వ్యాధి కలిగినా దాని వెనుక మన కర్మలు, ఇంద్రియలోలత, అజ్ఞానము (తెలియనితనము) కారణాలుగా ఉంటాయి. అద్భుత అంతరింద్రియమైన బుద్ధిగల మానవుడు తన దోషాలను, లోపాలను, అజ్ఞానాన్ని గుర్తించి వాటిని సరిచేసుకోవడానికి ప్రయత్నించాలి. తన బుద్ధికి అందకపోతే యోగ్యులైన వైద్యులను సంప్రదించి దోషాలను గుర్తించ యత్నించాలి. వాటికి పశ్చాత్తాపపడి వాటిని సవరించుకుంటూ తగిన చికిత్సలు చేసుకుంటే వ్యాధులు ఉపశమిస్తాయి. ఆ రకంగా పూర్ణ పురుషార్థంచేస్తూ భిషక్ పతియైన పరమేశ్వరుని ప్రార్థిస్తే, ధ్యానిస్తే వ్యాధులు తొందరగా నివారణ మౌతాయి. వ్యాధులకు కారణమౌతున్న

ఇంద్రియ మనోబుద్ధులలోని దోషాలు క్రమంగా క్షీణిస్తూ అద్భుతమైన మానసిక ప్రసన్నత కలుగుతుంది. అందుకు గాయత్రీమంత్ర జపం దాని ఉపాసన అద్భుతమైన సాధనం, ఆ మంత్రంలోని అర్థం - అర్థభావన అంతటి శక్తివంతమైనది.

ఓ౩మ్ భూర్భువః స్వః
తత్సవితుర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్ ॥

ఓ౩మ్ = ఓ సర్వవ్యాపక, సర్వసంరక్షక, సర్వేశ్వర !
భూః = నీవు సర్వవ్యాపక సత్‌స్వరూపుడవు.
భువః = అనంత జ్ఞాన సామర్థ్యములుగల చిత్‌స్వరూపుడవు.
స్వః = దుఃఖమిశ్రితముకాని కేవల ఆనంద స్వరూపుడవు.
తత్ = తత్ పద వాచ్యుడవైన ఓ అంతర్యామీ !
సవితుః = నీవు సత్ ప్రేరకుడవు - నన్ను సత్కర్మలయందు ప్రేరేపింపుము.
వరేణ్యం = నీవు వరించదగిన పరమ ఆప్తుడవు.
నీకన్న నా మేలును కోరువారు మరెవ్వరును లేరు.
భర్గో దేవస్య ధీమహి = అట్టి నీ భర్గః స్వరూపమును నాలో ధారణ చేసుకొనుచున్నాను. నాలోని బాధలను భయాలను దోషాలను, క్లేశాలను భస్మము చేయుము.
ధియో యో నః ప్రచోదయాత్ = నీవు మా బుద్ధులలో వసించి సత్‌ప్రేరణ లిచ్చుచు సన్మార్గమున నడిపి నీ ఆనందధామమునకు తీసుకొని పొమ్ము.

ఈ విధమైనటువంటి అర్థభావనతో ఉపాసనామగ్నులమై గాయత్రీ జపం చేస్తేనే సత్ ఫలితాలు కలుగుతాయి. లేకున్న కొంగ జపం వంటిదే అవుతుంది.

ఈ మంత్రం లోని భర్గః పదము అత్యంత విశిష్టమైనది. మిగిలిన పదములన్నీ ఈ పదమునకు విశేషణములే. భృజీ - భర్జనే అనే సంస్కృత మూలధాతువుతో నిర్మితమౌతుంది. అందుచే ఈ పదమునకు మొలకెత్తకుండా వేపుట, దగ్ధముచేయుట అనే అర్థాలు వస్తాయి. మన పాపపు సంస్కారాలను దగ్ధము చేసి నశింపజేయగల పరమేశ్వరాగ్ని అని ఈ మంత్రంలో అర్థం వస్తుంది.

**భుజ్యంతి పాపాని దుఃఖమూలాని యేన తత్ భర్గః** - అని నిర్వచనము. అట్టి భర్గాగ్నిని మన శరీరంలో ధారణచేసికొన్న దేహమాలిన్యాలు దహింపబడి ఆరోగ్యం కలుగుతుంది. మనస్సులో ధారణచేసికొంటే కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే ఆరు శత్రువులు నశించి మనశ్శాంతి లభిస్తుంది. క్షుద్రమైన ఆలోచనలు, ఆందోళనలు భయాలు భ్రాంతులు నశించి మనోధైర్యం కలుగుతుంది. బుద్ధిలో ధారణ చేసికొంటే అజ్ఞానం నశించి జ్ఞానవికాసం కలుగుతుంది. సత్యాసత్యాల, ధర్మాధర్మాల, న్యాయాన్యాయాల పాపపుణ్యాల, కర్తవ్యాకర్తవ్యాల వివేక జ్ఞానం కలుగుతుంది. జీవన యాత్ర సరళము సుఖమయము సుగమము అవుతుంది. ఆ భర్గాగ్నిని జీవాత్మలమైన మనలో ధారణచేసికొంటే అనాదిగా అనేక జన్మ మరణాలకు కారణమవుతూ అనేక కష్టాలకు గురిచేస్తున్న అవిద్య (ఆత్మానాత్మ వివేక హీనత), అస్మిత (మనో బంధనము) రాగద్వేషాలు, అభినివేశమనే మరణభయం నశించిపోతాయి. ఆత్మ దేదీప్యమానమై ప్రకాశిస్తుంది. ఆత్మ సాక్షాత్కారము జరిగి పోగొట్టుకున్న అమూల్యమైన

పెన్నిధిని పొందిన వారమవుతాము. పట్టువిడువక సాధన కొనసాగిస్తే మనలో వ్యాపించి ఉన్న పరమాత్మ సాక్షాత్కారమును పొంది పరమానంద సముద్రమున నోలలాడగలము. అట్టి ఆనందము ననుభవించిన ఋషులు ఆ మహదానంద మెట్టిదో న శక్యతే వర్ణయితుం గిరా - మేము మాటలలో వర్ణింపలేకున్నా"మని తమ అశక్తతను వ్రాసుకున్నారు. అట్టిది భర్గాగ్ని - పరమేశ్వరాగ్ని. అది భౌతిక రోగములను, భవరోగమును రెంటినీ బాపగల అద్వితీయమైన అశ్వినీదేవత

ఈ పరమేశ్వరాగ్నియే వేదాలలో పెక్కుచోట్ల **అగ్ని** గా పేర్కొనబడింది. ఋగ్వేదం **అగ్ని** పదముతోనే ప్రారంభ మయ్యింది. అది సామాన్య భౌతికాగ్ని కాదు. పరమేశ్వర వాచకాగ్ని. అది సర్వత్ర వ్యాపించి యున్నది. మన శరీరంలోను వ్యాపించి యున్న ఆ యగ్ని అశ్వినీ వైద్య దేవతవలె మన మనశ్శరీరాలను స్వస్థత పరచగలదు. అట్టి అగ్నిని ప్రతినిత్యం నిద్రలేవగనే మనలోనికి ఆహ్వానించాలని, అనగా గుర్తించి దానినుండి ప్రేరణ పొందాలని మన ఋషులు కొన్ని వేదమంత్రాలను నిర్దేశించారు. అందు మొదటి మంత్రం ఈ విధంగా ఉంది.

**ఓం ప్రాతరగ్నిం ప్రాతరింద్రం హవామహే**
**ప్రాతర్మిత్రా వరుణా ప్రాతరశ్వినా ।**
**ప్రాతర్భగం పూషణం బ్రహ్మణస్పతిం**
**ప్రాతః సోమ ముత రుద్రం హువేమ ॥** (ఋ. 7-41-1)

మేము ఈ ప్రాతః కాలమున పరమేశ్వరాగ్నిని మాలోనికి ఆహ్వానించుచున్నాము. ఆ యీశ్వరాగ్ని విశ్వమే ఐశ్వర్యముగాగల

ంద్రుడు. సర్వప్రాణుల మిత్రుడు, పాలించు వరుణుడు, ప్రాణాపానములుగా నున్న అశ్వినీదేవత, పుష్టిదాయకుడు, భజనీయుడు, బ్రహ్మాండాధిపతి, సౌమ్యుడు, మరియు పాపులపాలిటి రుద్రుడుకూడా అట్టి దివ్యగుణయుక్త అగ్నినామక పరమేశ్వరుని మాలోనికి ఆహ్వానించు చున్నాము.

పై మంత్రములోని పరమేశ్వరుని అనేక గుణములలో =శక్తులలో అశ్వినా శక్తి ఒకటి. ఆ శక్తి మనలో ప్రాణశక్తిగా, జీర్ణశక్తిగా, పునర్నిర్మాణము శక్తిగా రోగ నిరోధక, నివారక శక్తిగా మనలను సదా కాపాడుతున్నది.

వైద్యులు శరీరంలో జరిగిన మార్పులను సరిచేయగల ఔషధాలను ఎంపిక చేయుటలో సహకరించగలరేకాని వ్యాధులను నిర్మూలించలేరు. ఔషధాలు కేవలం తగిన పనిముట్లు మాత్రమే. ఆ పనిముట్లతో రోగనివారణ చేసేది మన శరీరంలో అశ్వినిగా ఉన్న పరమాత్మయే. అందుచేతనే ఆస్తికులైన వైద్యులంతా తమ తమ చికిత్సాలయాలలో **I Treat, He cures** అనే ఆంగ్ల వాక్యంగల పలకాలను పెట్టుకుంటారు. దాని అర్థం -నేను కేవలం తగిన చికిత్స చేయువాడను మాత్రమే రోగనివారణ చేయునది అతడే - ఆ పరమాత్మయే అని కదా! కనుక మనమంతా సర్వవ్యాపక సర్వేశ్వరుని అశ్వినీశక్తిని మనలోనికి ఆహ్వానింతుము - ధారణచేతము రండి.

భిషజానామ్ భిషక్ పతిమ్ అశ్వినాగ్నిమ్ హవామహే

# ఉపసంహారము

ప్రియపాఠకులారా !

మా యీ చిన్న గ్రంథములో అశ్వినీదేవతలని ఎవరెవరిని పేర్కొనవచ్చునో సూచనప్రాయంగా తెలుపడం జరిగింది. ఈ దృష్టితో వేదాలను అధ్యయనం చేస్తే నురెందరనో అశ్వినీదేవత లనవచ్చును. కొందరు శారీరక, మానసిక వైద్యులయితే మరికొందరు సామాజిక వైద్యులు. కొందరు బుద్ధికి కలిగే అజ్ఞానానికి చికిత్సకులయితే మరికొందరు జీవాత్మకు కలిగే అవిద్య అస్మిత రాగ,ద్వేష, అభినివేశాలనే వ్యాధులకు చికిత్సచేసే వైద్యులు.

వీరితో సామాజిక వైద్యులను సంస్కర్తలని బుద్ధికి చికిత్సచేసేవారిని గురువులని, ఆత్మకు చికిత్సచేసేవారిని ఋషులని (యోగులని) మనం వ్యవహరిస్తున్నాము. కనుక ఇట్టివారందరిని అశ్వినీదేవత లనవచ్చును. ఏ వైద్యులైనా వేదవిజ్ఞానానికి అనుకూలంగా చికిత్సచేయగలిగితేనే చిరకాలం ఆ చికత్స ఆరోగ్యాన్ని, ఆనందాన్ని కలిగిస్తుంది. దానికి భిన్నంగా ఉండే తాత్కాలిక ఉపశమనాన్ని కలిగించటమో లేక ఆ వ్యాధి అణచబడి (సప్రెస్ అయి) మరొక క్రొత్త వ్యాధికి కారణం కావటమో జరుగుతుంది. ఏలయన, ఎవరెంతటి మేధావులైనా, త్యాగులైనా, యోగులైనా వారి జ్ఞానం సీమితమే. జ్ఞానానికి పరాకాష్ఠ పరిపూర్ణత కలవాడు సృష్టికర్తయైన పరమేశ్వరుడే. అతనిలోనే పరిపూర్ణ జ్ఞానం ఉంది. అట్టి పరమేశ్వరుడు దయతో తన జ్ఞానాన్ని ఆది ఋషులద్వారా మానవులకు అందజేసాడు. ఆ జ్ఞానమే కాలాంతరంలో గ్రంథస్థము చేయబడి నేడు వేదాలుగా మనకు లభిస్తుంది. అందులో సమస్త సత్యవిద్యల మూల సూత్రాలు ఉన్నాయి. సత్యవిద్యలంటే సర్వకాలములందును జ్ఞాన విజ్ఞానాలకు నిలబడి ఉండేవి. మిగిలిన విద్యలన్నీ బహుళ ప్రచారం పొందినప్పటికి కాలాంతరంలో నశించకతప్పదు. అందుచే అవన్నీ అసత్యవిద్యలు - ఎప్పటికి నిలిచి ఉండేవి కాదు.

ఋగ్వేదం జ్ఞానముఖ్యంగా పదార్థవిజ్ఞానం బోధిస్తుంది. సృష్టిలోని సత్యపదార్థముల గుణగణాలను సంక్షిప్తంగా మూలసూత్రాలుగా వర్ణిస్తుంది.

వాటిని మనం మననం చేసి (ఆలోచించి) అర్థంచేసుకోవాలి. అందు ఎన్నో ఓషధుల గుణగణాలు తెలుపబడ్డాయి. యజుర్వేదం కర్మకాండను బోధిస్తుంది మానవులు ఏయే కర్మలు చేస్తే వారికి ఉన్నతి కలుగునో వివరిస్తుంది. అందు ఓషధులను సద్వినియోగపరచుకొని సర్వమానవులు దీర్ఘాయురారోగ్యములను పొందుదురను ప్రేరణలు అనేకం ఉన్నాయి. ముఖ్యంగా యజుర్వేదపు 12వ అధ్యాయంలో నిట్టి ప్రేరణలు అనేకం కనబడతాయి.

ఉదాహరణకు :

**అశ్వత్థే వో నిషదనం పర్ణే వో వసతిష్కృతా ।**
**గోభాజ ఇత్ కిలాసథ యత్ సనవథ పూరుషమ్ ॥ (యజు. 12-79)**

ఓ మానవులారా ! మీ శరీరములు అశ్వత్థములు. అవి రేపటికుండునో ఉండవో చెప్పజాలము. అట్టి శరీరము మీకు నివాస స్థానముగా నున్నది. పర్ణే తామరాకుపై నీటిబొట్టువలె నున్నది. కనుక పురుషార్థపరులై శుద్ధమైన అన్నజలాదులతో శరీరమును దృఢపరచుకొనుడు. తగిన ఓషధులను సేవించుచు వ్యాధులను పారద్రోలుకొనుచు ఈ పృథివిపై సుఖమయ జీవనము గడుపుడు" అని పరమేశ్వరుని ఉపదేశము.

అయితే అందరు వైద్యులు కాలేరు. అట్టి జ్ఞానము, అభిరుచి గలవారే వైద్యులు కాగలరు. అందుచే అట్టిజ్ఞానముగల సమర్థులైన విప్రభిషక్‌లను సంప్రదించుమని, విప్రః స **ఉచ్యతే భిషగ్రక్షోహామీవచాతనః॥ (యజు. 12-80)**

శరీరంలో ఏర్పడే రోగాలను, క్రిముల ద్వారా కలిగే రోగాలను నివారింపగల సమర్థులైన విప్రభిషక్‌లను (విద్యావంతులైన వైద్యులను) సంప్రదించి తెలిసికోండని వేదం ఉపదేశిస్తుంది. తదుపరి వైద్యులకుండవలసిన లక్షణాలను (గుణగణాలను) వివరిస్తుంది. ఉత్తమ ఔషధాలను ఏవిధంగా సేకరించి భద్రపరచుకోవలెనో వాటిని వివిధ మిశ్రమములుగా (కాంపోజిషన్‌గా) నిర్మించుకొని సిద్ధముగా నుంచుకొనవలెనో విశదీకరిస్తుంది. రోగులను ఏ విధముగా పరీక్షించి తగిన ఔషధాల నివ్వవలెనో, వారికి ఏ విధంగా ధైర్యం

చెప్పి సమాధానపరచవలెనో వివరిస్తుంది. కేవలము మనుష్యులకేగాక పెంపుడు జంతువులుగా నుండు పశుపక్ష్యాదులకును చక్కటి చికిత్స చెయవలెనంటుంది.

**భేషజమసి భేషజం గవేశ్వాయ పురుషాయ భేషజమ్ ।**
**సుఖం మేషాయ మేష్యై ॥ (యజు. 3-59)**

ఓ వైద్యులారా ! ఈ లోకమున కేవలము మానవులకొరకేగాక గోవులకు, అశ్వములకు, మేక గొఱ్ఱెమొదలగు జంతువులకును ఔషధములున్నవి. కాన వాటికిని చికిత్స చేయుడు.

ఈ విధంగా ఎన్నెన్నో ప్రేరణలను ఇస్తుంది యజుర్వేదం.

సామవేదం ఉపాసనాకాండను బోధించేది. పరమేశ్వరోపాసన వైద్యులు చేస్తే వారి బుద్ధి వికసిస్తుంది.. చక్కటి ప్రేరణలు కలుగుతాయి. రోగులుచేస్తే బాధలు ఉపశమిస్తాయి. పరమేశ్వరుని అనుగ్రహం కలిగితే అద్భుతంగా రోగాలు నయమౌతాయి. ఆ పరమేశ్వరుడు **భిషక్తి విశ్వం యత్తురమ్** । ఎంతటి భయంకర వ్యాధులతో పీడింపబడుచున్నను నివారింపగల సామర్థ్యం గలవాడు. ప్రేమన్ధ : ఖ్యన్ని : అంధునకు చక్కనిచూపు నివ్వగలడు. **శ్రోణో భూత్** ॥ (ఋ. 8-34-2) కుంటివానిని చక్కగా నడిపింపగలడు. ఈ భావమునే **మూకం కరోతి వాచాలం పంగులం లంఘయతే గిరిమ్**' అని ఒక కవి కీర్తించాడు. కనుక పరమేశ్వరోపాసన చికిత్సలో ఒక అంగమే.

ఇక అథర్వవేదం విజ్ఞానకాండను బోధిస్తుంది. విజ్ఞానం అంటే విశేషజ్ఞానం మనకు కలిగిన జ్ఞానంతో అనేకానేక ప్రయోగాలు (ఎక్స్పెరిమెంట్స్) చేసి నూతనావిష్కారాలు చెయ్యాలి. అప్పుడే ప్రగతి సాధ్యం. లేకుంటే క్రమంగా మానవజాతి నిర్వీర్యమై నిస్తేజమై ఆటవికజాతిగా మారిపోతుంది. అట్టి ప్రగతి కొరకు అథర్వవేదంలో అనేకానేక ప్రేరణలు మనకు కనబడతాయి. యంత్రవిమానాది భౌతిక సాధనాల ఆవిష్కారాలకు చెందిన ప్రేరణలేగాక చికిత్సా ప్రక్రియకు చెందిన నూతనావిష్కారాలకు ప్రేరణలెన్నెన్నో అథర్వవేదంలో

ఉన్నాయి. ఆ మార్గంలో ప్రయోగాలుచేస్తే నేడు అసాధ్యంగా భావింపబడే వ్యాధులన్నిటిని సుసాధ్యం చెయ్యవచ్చు.

వైద్యుల కర్తవ్యములను వేదం ఎంత చక్కగా బోధిస్తుందో చూడండి.

యద్ వా దేవ భిషజ్యథః (ఋ. 8-9-6)

ఓ వైద్యులో ! మీ నైపుణ్యం అంతా ఉపయోగించి రోగులకు చక్కగా చికిత్స చెయ్యండి.

**యదామయతి నిష్కృథ' (ఋ. 10-97-9)**

రోగకారణాలను కనుగొని వాటిని తొలగించండి.

**ఓషధీ ః ప్రాచుచ్యవుః యత్ కించ తత్వ్రో రపః । (ఋ.10-97-10)**

ఓషధులద్వారా రోగి శరీరములోని సర్వదోషములను పారద్రోలండి. (ఏవైనా కొన్ని దోషములు మిగిలి ఉన్న రోగము తిరగబెట్టును).

**ఇమం మే అగదం కృత' (ఋ. 10-97-2)**

రోగియొక్క శరీర మనస్సులను పూర్తిగా రోగరహితము చేయుడు.

**ప్ర న ఆయూంషి తారిషత్' (సామ. 184)**

అందరికి దీర్ఘాయువు కలుగునట్లు ఆహార విహార నియమములను ఉపదేశింపుడు. అవసరమును బట్టి తగిన ఔషధముల సూచించుడు.

**నిష్కర్తా విహృతం పునః' (సామ. 244)**

తెగిన లేదా విరిగిన శరీరాంగములను శల్యచికిత్సద్వారా అతుకుడు.

**యథా నో అస్య పరిధిష్పతాతి' (అథ. 5-29-2)**

క్రిములవల్ల కలిగే అంటురోగములు వ్యాపించకుండా అదుపుచేయుడు.

**యశ్చకార స నిష్కరత్ స ఏవ సుభిషక్తమ ః' (అథ 2-9-5)**

ఓ వైద్యులారా ! నిరంతరము పరిశోధనాపూర్వకంగా మీ చికిత్సా నైపుణ్యమును పెంచుకొనుచు పవిత్ర జీవనమును గడుపుడు. అప్పుడే మీరు ఉత్తమకోటికి చెందిన వైద్యులు కాగలరు.

ఇట్టి ప్రేరణలు నాలుగు వేదములందును కోకొల్లలు. కావున వేదాలు

GAYATRI SERIES No. 37

ASHWINI DEVATALU

Rs. 20/-

**ఆపస్తత్ సర్వం నిష్కరన్**
**భిషజాం సుభిషక్తమా ః॥**

**(అథర్వవేదము (6-24-2)**

శరీరమందు వ్యాపించియున్న సమస్త శారీరక మానసిక బాధలను (రోగములను) తొలగించువాడే వైద్యులలో సర్వోత్తమ వైద్యుడు.

"He who heals all the ailments (both physical and mental sufferings) is the best physician"

"That which restores health is the proper remedy. He who cures the patient is the best physician"

"The physician's high and only mission is to restore the sick to health"

"Life is short, art is long, opportunity is fleeting, experiment is fallacious and judgment is difficult"

(Allopathy)

PRINTSHOP 5532 0300